శ్రీ

# చంద్రహాస చరిత్ర.

BY

శ్రీ శేషాద్రి రమణ కవులు

( శతావధానులు. )

PUBLISHED BY

మాదిరాజు రఘునాధరావు

1928.

వెల 0—6—0.

# OPINIONS

# అభిప్రాయములు.

శ్రీరాములు.

"చంద్రహాస చరిత్ర" అను నాల్గాశ్వాసముల గ్రంథము నామూలాగ్రము చూచితిని. కథ నీతిబోధక మగుటయే కాక హృదయరంజకమునై యున్నది. కవితయుఁ బ్రకృత కాలానుగుణమయి మృదుమధుర శైలిలో నున్నది. ఇందు వచనములు ఏడు, ఎనిమిది, కన్న నెక్కువ లేవు. తక్కినవన్నియుఁ బద్యములె కావున ధారణకుఁ గూడ ననువగును. ఇట్టి గ్రంథములు పాఠశాలల యందుపయోగింపఁ బడినచోఁ బిల్లలకు బహూపయోగకరములని నాయాశయము.

గుంటూరు,
౧౫—౫—౩౫.

కాశీ కృష్ణాచార్యులు,
శతావధాని.

శ్రీగురవేనమః.

తే॥ గీ॥ చంద్రహాసుని కథయెంత ♦ సరసమగునొ
దానికిందగ్గ కవనమ్ము ♦ దనరునిందు
ప్రకృతకాలవిద్యార్థుల ♦ పారమునకు
ననువయిన పుస్తకమ్మన ♦ నభిమతమ్ము॥

గుంటూరు,
10—10—1927

శిష్టా హనుమచ్ఛాస్త్రి
ప్రధానాంధ్రోపాధ్యాయుడు,
టౌన్ హైస్కూలు

# పీ ఠి క.

శ్రీభరతావనిగల ఛప్పన్నారుదేశములలో నాంధ్రరాష్ట్రమొకప్పుడు దిగంతప్రఖ్యాతి నందియుండెను. దీనికి త్రిలింగదేశమని యుపనామముగలదు. త్రిలింగతద్భవము తెలుగు. ఇయ్యది ఆంధ్రభోజుఁడని నుతిగన్న కృష్ణదేవరాయలకాలమున వికాసము జెందుటకారంభించెను. మనుచరిత్ర విష్ణుచిత్తీయము వసుచరిత్ర మొదలగు ప్రబంధములెన్నియో బయలువెడలెను. తదుపరిరాజులు ధనదాతలు మండలేశ్వరులు మొదలగువారు తమపేరులు స్థిరస్థాయిగానుండుటకు కృతులే హేతువులని దలంచి కవులసత్కరించి పద్యగద్యాదిగ్రంథముల నంకితముగొనియుండిరి. వర్తమానకాలమం దనేక నవలలు చరిత్రలు తత్వార్థకాదిశాస్త్రములు పరిపాలనావిధానసూత్రములు వస్తునిర్మాణ రసాయనాదిశాస్త్రములు కవిజీవితములు భాషాంతరీకరణములు మొదలగునవి బయలువెడలి భాషాపోషణకు దోహదమొసంగియుండెను కానిగద్యపద్యప్రబంధరచన కొంతవరకు మందగమనము వహించినటులప్రస్తుత పరిస్థితి దెలుపుచున్నది. ఇట్టితరుణములో చంద్రహాసచరిత్రమను నాలుగాశ్వాసముల కబ్బము వ్రాయబడుట శ్రేయస్కరమే. ఏతత్కృతిభర్తయగు మాదిరాజు రఘునాథరావుగారు వందనీయులు. వీరునియోగిబ్రాహ్మణులు. సద్వంశజులు ఈకృతినాథునితండ్రి అబ్బరాజుగారు. తల్లిజగ్గాయమ్మగారు. ఈమెతండ్రిప్రశస్తవంశీయుఁడగు తుళ్ళూరి కోటిలింగంగారు. తుళ్ళూరివారువైద్యశాస్త్రాదిగ్రంథకర్తలు కృతిపతులునై విరాజిల్లినారు. శరభరాజీయము భేషజదర్పణాదిగ్రంథముల రచించిన దీతుళ్ళూరివంశజులే. కృతినాథుని గూర్చి గ్రంథకర్త వ్రాసినపద్యము యథార్థమును ప్రకటించుచున్నది.

చం॥ సరసుఁడు వ్యావహారిక వి ♦ శారదుఁ డాంధ్రకవిత్వ తత్త్వ ...
స్వరు డతిధార్మికుండు ♦ విలసత్తర వైద్యవిశేష వేది సు ...
స్థిరశివభక్తితత్పరుఁడు ధీవరు ♦ డారఘునాధరాయఁ డి ...
ద్ధర దనకీర్తిచంద్రికల, దాల్చి ♦ దిశల్ ప్రభలీనుచుండఁగ౯. ...

దీనియందతిశయోక్తి లేదనుట సందేహము లేదు. కృతిపతి...
తర లుభయగోత్రములవారును ధర్మకార్య ప్రతిష్ఠాపకులగుటయే...
విద్యాప్రవీణులై యుండుటచే ఇట్టివంశములకు జెందిన రఘునాధరా...
హ్వయుఁ డన్నిటిచేకీర్తినందుట దుర్లభమైనదిగాదు. వైద్యశాస్త్రమ...
బట్టువడకయుండును. విద్య కొన్నివంశములందు పారంపర్యము...
వచ్చుచుండును. ఉభయవంశములట్టివియైనపుడిక చెప్పవలశినదని లే...

కృతిపతి జననితమ్ముఁడును వైద్యశాస్త్ర విశారదుఁడును ప్రశ...
కవియునైన పిచ్చయ్యగారు నాకు మిగులగౌరవనీయులు. కృతికర్త...
కృతినాధుఁడు ప్రశస్తపురుషుఁడులభించుటయు సదృష్టమేగదా? మణి...
నకంకణమును కంకణమువలన మణియు ప్రకాశించునటుల కృతిపతి...
తికర్తలుగలిగిన మిగులకీర్తినిగాంచి ప్రకాశించుచున్నారు. ఈగ్రంథ...
తనను గూర్చి ఈపద్యములో దెలియపరచియున్నాఁడు.

మ॥ నను శ్రీరాఘవపాదపద్మ భజనా ♦ సక్తైకచిత్తాంబుజా
తుని శేషార్యసమాహ్వయున్నవరస ♦ స్తోమాభిరామాచ్య...
ఖనిని౯ బిల్చి లవంగచంద్రవరపూ ♦ గంబైనతాంబూలమ...
ఘనవస్త్రాదులొసంగి పల్కెమృదువా ♦ క్యస్ఫూర్తి వాటిల్ల...

కవి తాను ధూపాటి శేషాచార్యుని పౌత్రుఁడైనటులను వే...
రంగాచార్యుని పుత్రుఁడైనటులను నుడివియున్నాఁడు. ఈతఁడు శేషాద్రి...

...రు నాకు పరిచయులగుటచే దెలసినవరకు వివరించుచున్నాడను. ...రు శేషాద్రి రమణసోదర కవులలోనొకరు. శతావధానులు. శాస ...నముల పరిశోధించి విమర్శించుటలో శక్తిసామర్థ్యముగలవారు. మరి కొన్ని నాటకాదిపుస్తకములు వ్రాసినవారు. పాఠకమహాశయులకు దె ...లిసియున్నవారే. కవిత్వము కాలోచితవర్ణాలంకృతమై మృదుమధుర ప ...లలితమై ద్రాక్షపాకముగా నలరారుచున్నది. అలంకార వర్ణనాదులు ...పూర్వకవుల సాంప్రదాయకమున కెంతయు దీసిపోనేరవు. పద్యము ...ం డాంధ్రశబ్దప్రయోగములే విశేషముగా కన్పించుచున్నవి. లోకో ...లెందందు బొందుపరుపబడియున్నవి. కథ దుష్టాత్ములకు గల్గిన కీడు ...లుపుచుండుటచే నీతిప్రబోధకమైన దనుటకు సంశయించ బనిలేదు. ...పొత్తమును ఆంధ్రాంగ్ల పాఠశాలలయందు పఠనీయగ్రంథముగా ...ర్పాటుజేసిన బాలురకు భాషాపరిచయముగలుగుటయేగాక దుష్టత ...ముతొలగించి నీతిని గఱుపగలదు.

శైలిజూపుటకు కొన్ని పద్యములు చూపబడుచున్నవి.

| | | |
|---|---|---|
| ఉ॥ | వాసన లేనిపువ్వమును. | పుట 31 |
| గీ॥ | పాలుద్రావెడి. | 37 |
| మ॥ | అరచేనుంచియు. | 53 |

ఇట్లు,

గుంటూరు,
18_5_28.

వెంకటసుబ్బరాయ గుప్త గ్రంథి.
ధన్వంతరి, వైద్యలహరి, స్త్రీ బాల వైద్యసుధాబ్ధి,
సంపూర్ణ భాగవతి నాటకాది గ్రంథకర్త.

# నామగోపన రథబంధయుతసీసం.

శ్రీరమణీమనోహార కౌస్తుభధరా సుగుణ
హారవిరాజ విగళితాంహా!
వనజాక్ష శ్రీకర ఘననీలసమవర్ణ భామాజనా
జ్ఞాత్ర వనధిశయన
సనకాదిమునిలోక జనవశీకరచిత్త గజవరావస
దక్ష గరుడవాహా!
భక్తరక్షక మంజుభాషణ హరనుత శేషశైల
విహార చిరయశోబ్ధి!
విజయసఖ రఘురామ శోభితకువలయ
నాథ మురహర నగధర నారసింహా
రాజముఖ యఘజయ ధనరాజమైత్రిక
వస్తుజాల మొసంగుము వైరిహారి

గ్రంథకర్త,

30_1_1918.

శ్రీరస్తు॥ జయోస్తు.

శ్రీహయగ్రీవాయనమః.

# చంద్రహాస చరిత్ర.

శ్రీలీలాకరణంబు మంజులయశస్సీమంతినీభూషణం
బాలీనాఘవిదారణంబు కవితావ్యాసంగసంగార్భటీ
కేళీద్యోతక మైన శ్రీహరికృపాకృప్తప్రభావ్యాపకం
బాలీనాశయసౌఖ్య మిచ్చి రఘునాథామాత్యు రక్షించుతన్॥

చం॥ కరమున వీణఁదాల్చి రసకల్పకమంజుతరోక్తిగీతికా
పరిణతి తాండవింప మృదుపంచమనాదము తోడ గానముల్
నెఱపు పయోజగర్భు తరుణీమణి ప్రోచును గాత మత్కృతీ
శ్వరు రఘునాథమంత్రివరు సంతతధర్మకళాధురంధరున్। ౧

చ॥ తన యనురాగమున్ దెలుపఁ దన్వికి నర్ధశరీరమిచ్చి త
న్విని యనురాగదృష్టిఁ గను పెంపున నాయమ దేహమందు సా
మును గొని సానురాగరసమున్ సమభోగ్యముగా నొనర్చు నా
ఘనుఁడు భవానిశంకరుఁడు క్రమయశున్ గృతిభర్తనోముతన్

చ॥ వనరుహనాభు పొక్కిలి నివాసతలంబు,జగత్త్రియంబు సృ
ష్టిని బొనరించు చేఁత నిజశేముషి, పల్కువెలంది సేనలన్
గొనుట హితంకరం బయిన కూరిమిసేఁతగ నొప్పు నట్టి య
వ్వనజజుఁ డిచ్చుఁ గాఁతఁగృతిభర్తకు దీర్ఘతరాయురున్నతుల్ ॥

చ॥ వితతవియోగదుఃఖమున. విన్నదనంబు వహించి లంకలో
నతులదురంతకష్టముల నందుచునున్న విదేహపుత్రికిన్
బతిశుభవార్తఁ దెల్పిన ప్రభావపయోనిధి యాంజనేయుఁ డు
న్నతశుభదృష్టితోడ రఘునాథసమాహ్వయు నోముఁ గావుతన్

మ॥ గురుఁడై యాదికళావిధుల్ గఱపి పెక్కుల్ గావ్యరత్నంబులన్
విరచింపం గల తెల్వి నిచ్చియును పైఁ బెండ్లిండ్లపేరంటముల్
నెఱయన్ జేసి మహావధానకవితానిర్మాల్యసింహాసన
స్థిరునిన్ జేసిన మత్పితన్ దలఁతు రాశీభూతవిద్యాయుతున్॥

చ॥ గురుని పదాంబుజాతములకున్ బ్రణమిల్లి యపూర్వసత్కవీ
శ్వరులకు వందనంబులను సల్పి సనాతనమార్గగామినై
సరసహృదూక్తిబంధురలసత్తరమై తగు నాంధ్రకావ్యమున్

విరచనమున్ బొనర్తు సుకవిప్రభులార! యనుగ్రహింపుఁడీ॥

వ. ఇష్టిష్టదేవతాప్రార్థనంబును గురుస్తుతియుఁ బూర్వకవిస్మర
ణంబును గావించికొండొక కావ్యంబు రచింప నుద్యోగింప నున్న
సమయంబున.

కృతినిర్మాణప్రస్తావన.

సీ॥ తనపూర్వు లుద్ధరించిన యాలయంబును
పునరుద్ధరించిన భూరియశుఁడు
శమదమాదికగుణసమితికి నిధి యని
జనులచే నుతి గను సజ్జనుండు
దానధర్మములు హస్తద్వయంబునకును
నైజముల్ జేసిన న్యాయవిదుఁడు
సత్యప్రియత్వంబు సర్వసమత్వంబు
నాచరించెడి కరుణాకరుండు
అబ్బరాజుకులాంభోధి కబ్జమిత్రుఁ
డార్యనుతసంతతవితీర్ణహారిమూర్తి
సాధుమార్గహితుఁడు రఘునాథరాయ
లెలమితోడ గృహంబునఁగొలువుఁదీరి॥

మ॥ నను శ్రీరాఘవపాదపద్మభజనాసంధైకచిత్తాంబుజా
తుని శేషార్యసమాహ్వయున్ నవరసస్తోమాభిరామాచ్ఛవా
ఖనినిన్ బిల్చి లవంగచంద్రవరపూగంబైన తాంబూలమున్
ఘనవస్త్రాదు లొసంగి పల్కె మృదువాక్యస్ఫూర్తి వాటిల్లఁగన్॥

కం॥ శ్రీచంద్రహాసు చరితము
వాచాలకవిత్వ వైభవం బలరారన్
బ్రాహ్మణ్యముగాఁ గృతి శే
షాచార్యా! సలిపి నాకు సంకీర్తి మిమ్మా॥

కం॥ అనుటయుఁ బరమానందం
బును జెంది రసానుకూలముగఁ గావ్యంబున్
దెనుఁగున లిఖియించితి స
జ్జనులారా! కావ్యరసము చవిగొనఁగఁ దగున్॥

వంశావతారము.

కం॥ దృశ్యాదృశ్యాత్మిక ధీ
వశ్యపరబ్రహ్మపాదపంకజభజనా
వశ్యాచరణుఁడు శ్రీమ
త్కాశ్యపముని మించు మౌనిగణనుతకీర్తిన్॥

ఉ॥ ఆ యనఘాత్మశాలియె నిజాన్వయగోత్రవరుండు గాఁగఁ దే
జోయుతుఁ డార్యసంస్తుతయశోరమణీయదిగంతరుండు శ్వ
శ్రేయసల్లోకసంతతవశీకరణప్రవణుండు కావ్యవి
ద్గేయుఁడు మాదిరాజు చెలఁగె సవ్యవహారకళాకలాపుఁడై॥

కం॥ ఆ మాదిరాజు లోకా
సామాన్యయశంబుఁ గాంచి సాత్త్వికమతియై
భూమి [illegible] మొదలుగ
నామహితాన్వయము నాయకాఖ్య వహించెన్॥

శా. నాగ్గంగాశరసారహీరనిభదివ్యత్కీర్తి విభ్రాజనా
జగ్గాయమ్మ స్వగేహినీతిలకమై సౌజన్యముల్ జూప స
మ్యగ్గార్హస్థ్యసుఖానుభావనవసంపచ్ఛాలియై సద్యశ
స్సద్గంధోజ్జ్వలుఁ డబ్బరా జలరెఁ దత్సద్వంశభూషాత్ముఁడై॥ ౧౬

సీ॥ అర్థిజనంబుల కన్నదాన మొనర్చి
వితరణవిఖ్యాతివిభవ మందె
సకలపుణ్యక్షేత్రసందర్శనము సల్పి
గార్హస్థ్యధర్మముల్ గౌరవించె
శ్రితకామినీతిరస్కృతి సల్పి యేకప
త్నీవ్రతధర్మంబు నిర్వహించెఁ
గవులచే నుతిపద్యకాండంబు గ్రహియించి
స్థిరయశస్సాంద్రచంద్రికల నించె
గేహినీదన పేరుతో "నబ్బరాజుపాలె"
మనెడి నగరంబు నిర్మించె నతఁడు సచివ
మాత్రుఁడే వందియాచకస్తోత్రదామ
రాజితవికాసఖని యబ్బరాజుమంత్రి॥ ౧౭

కం॥ అల యబ్బరాజుసచివుఁడు
కులసతితో మెలఁగు చుండఁ గొమరుఁడు గలిగెన్
కలితకళాపద్మజుఁ డు
జ్జ్వలరూపుఁడు శరభరాజు జనసుతగుణుఁడై॥ ౧౮

చం॥ గురుతరసద్యశోధనముఁగూర్చి నిరంతరసత్యభాషణా
కరుఁడయి పూర్వకావ్యరసగంధమధుద్రవపానకౌతుకా
భరణగుణాభిరామ నిరవద్యతరప్రతిభాప్తి మీఱి ధీ
రరసికు లెన్నఁగా శరభరాజు తనూజులఁగాంచె నల్వురన్॥

సీ॥ వితతవిరోధిదుష్కృతదుస్తరధ్వాంత
యామినీనిశిరాజు సోమరాజు
అతులశృంగారరసాకరయువమనో
హారిణీరతిరాజు వీరరాజు
ధృతిపరాక్రమరసాదికతిరస్కృతవనీ
రమణీయమృగరాజు రామరాజు
సతతసత్యవ్రతాచరణనిర్మలయశో
రఘురాజు శ్రీశివరామరాజు
జలజసంభవు ముఖచతుష్టయము రీతిఁ
గల్పతరుశాఖికాచతుష్కంబుపగిది
శరభరాజు ప్రమోదవిస్తరము నొంద
మించి రౌదార్యలక్ష్మి వరించ ధాత్రి॥

కం॥ వీరల లోపల గుణవి
స్తారుండై రామరాజు ధార్మికవిద్యా
పారాధిగమనుఁడై శశి

తారానిభశుభ్ర కీర్తిధనము గడించెన్॥

చ॥ ప్రవిమలకృష్ణవేణినది పశ్చిము మందలి "రావిపూడి"లో
భవునిప్రతిష్ఠ సల్పి యపవర్గము లందియు నబ్బరాజుప
త్ని వసుధ పావనత్వముఫలింపఁ దటాక మొనర్చి శైలజా
ధవునిప్రతిష్ఠ సల్పియుఁ బ్రథఁగనె రామయమంత్రి ధన్యుఁడై॥ ౨౨

కం॥ ఆ రామయ పెండ్లాడె ద
యారాజితహృదయ రామమాంబను సుగుణా
ధారమతి వేంకమాంబను
చారుతరాత్మీయకీర్తిసన్నిభ మతులన్॥ ౨౩

చం॥ ఎరుగ దసూయ భర్తృహితమే యొనరించుచు నుండు సత్యవా
క్పరిణతి పీడనాడదు కృపామతి వీడదు రామమాంబ సో
దరులను బోలె నన్యులను దన్నను సల్పును నాథుసేవ దు
శ్చరితులఁగాంచ నోపదు లసన్మతి వేంకమ సర్వవేళలన్॥ ౨౪

సీ॥ ఇరువురు శారదాతరుణితో నాత్రేయి
తోఁ బోలుదురు కళాస్తోకగరిమ
ఇరువురు ధారుణీధరజాతతో ధరా
జాతతోఁ దుల్యులు సత్యకలన
ఇరువురు నింద్రుని యింతితో సత్యావ
రోరుతో సమలు స్వరూపనియతి
ఇరువురు చంద్రసోదరితోడ ననసూయ
తో సమము బోదు సంస్తుతగుణాప్తి

ఇరువురకు నిర్వురే సాటి పరమశాంతి
దాంతిముఖసద్గుణైకసంతానమందు
రామమాంబిక సద్గుణరత్నపేటి
వేంకమాంబిక సత్యమూర్వీవధూటి॥

కం॥ ప్రథమసతి కుదయ మందెను
ప్రథమానయశుండు శంకరయ్య వితీర్ణ
గ్రథనైకనిపుణుఁడై మా
సధనస్తవనీయగుణగణప్రవరుండై॥

కం॥ కాంచె ద్వితీయాంగన ధీ
సంచితనిరవద్యచరితు శమదమశాంత్యా
ద్యంచితమానసపదు ధ
ర్మాంచరు యని తలచు నమ్మి రాజవరేణ్యున్॥

సీ॥ సామ్రాజ్యరక్షణచాకచక్యంబునఁ
జాణక్యమార్గంబు సంతరించి
రాజకీయరహస్యయోజనావిధులలో
నల యుగంధరనీతి నభ్యసించి
పరిపాలనక్రియాపాండిత్యగరిమలోఁ
దిక్కనయాజి పోఁడిక గ్రహించి
స్వాతంత్ర్యచాతుర్యసామరస్యములలోఁ
దిమ్మరుసుమంత్రి మార్గమ్ము గలచి

భాసురయశోఽభిరాముఁడై నాసిరెడ్డి
వేంకటాద్రివసుంధరావిభుని చెంత
సచివపదమున మిగులఁ బ్రశస్తి గాంచె
నతఁడు సామాన్యుఁడే శంకరయ్యమంత్రి! ౨౮

కం॥ ఆ శంకరమంత్రికి గుణ
లేశగ్రహణైకసుగుణలీలావిభవుం
డాశాపరీతనుతిపద
పేశలుఁ డగు కోటమంత్రివిభుఁడు జనించెన్॥ ౨౯

ఉ॥ శశిధరు పాదపంకరుహభక్తియుతుం డగు కోటయాఖ్యుఁడే
మణి పరిపాలనాగతిసమగ్రకలావిభవంబు నేర్చి తా
గణకపదంబు నందుఁ బరికర్షకు లుజ్జ్వలసమ్మదోక్తిభూ
షణము లొసంగ మించె సుయశఃకలనావలమానమూర్తియై॥

సారభవానిశంకరపదాంబుజముల్ మది నిల్పి భర్తృసే
వారమణీయసద్వ్రతవిభాసురస్వచ్ఛయశఃకలాపయై
మీఱెను వేంకమాంబ యెలమిన్ ఘను కోటయమంత్రి భార్యయై
వారధికన్యకాసుగుణవైభవసంగతయై ధరాస్థలిన్॥ ౩౦

కం॥ కొడుకుల నా కోటయసచి
వుఁడు గనియెన్ గులజయందుఁ బురుషార్థములో
జడజజు నాస్యచతుష్కమొ
పుడమిం [illegible]॥ ౩౧

సీ॥ ప్రథమపుత్రుండు కవివర్యసంస్తవనీయ
హారిసద్గుణశాలి యబ్బరాజు
రెండవ తనయుఁ డఖండగాయకకవి
త్వప్రాభవుండు రామబ్రహ్మమంత్రి
మూడవసుతుండు సమ్ముదితధాత్రీనాథ
సంస్థానవర్తి కృష్ణయ్యమంత్రి
నాల్గవతనుజుఁ డనన్యసామాన్యని
త్య కవిత్వవిభుండు ముత్యముబుధుండు
జననిజనకుల పుణ్యా లేశంబులిట్లు
భాసుకారపుత్రరూపములఁ గాంచె
ననుచు జనములు కీర్తింప నలరి రిలను
గోత్రమునికాశ్యపుని కీర్తి క్రొత్తలెత్త॥
గీ॥ వారిలోఁ గృష్ణమంత్రి ప్రాభవము నంది
యలరి వేంకటలక్ష్మమ యందుఁ బుత్రుఁ
గాంచెఁ గోటీశ్వరుని దానకలితహస్త
పద్మ గణికపదస్థితు భవ్యచరితు॥
ఉ॥ తమ్ములు ముగ్వు రాశ్రయహితమ్ముగ ధర్మనయాధిగమ్యమా
ర్గమ్మున భ్రాతృభక్తివిధురమ్ముగ వర్తనసల్పుచుండఁగా
సమ్ముదితానవద్యవిలసద్యశుఁడై తగె నబ్బరాజు త
ధ్యమ్మగు నబ్బ! శ్రా జితేఁడ యంచును వారలు సన్నుతింప

॥ శరభరాజీయాది సద్గ్రంథనిర్మాత
శరభరా జేతన్వి జనకుతండ్రి
వైద్యకశాకలాపప్రాయుఁడౌ కోటి
లింగసుధీరుఁ డే లేమ తండ్రి
కవితాభిమతసమగ్రజ్ఞానసంశోభి
పిచ్చయ్య సచివుఁ డే వెలఁదితమ్ముఁ
డార్యసం స్తవనీయచర్యాభిరామమౌ
తుళ్ళూరుకుల మే వధూటినెలవు ॥
పరమపదవాస నిర్మలపాదపద్మ
సేవనాలోలరూప మే చెలువ మనసు
అట్టి జగ్గాయమను బెండ్లియాడి మించె
నబ్బరాజు గభీరపయోఽబ్ధిరాజు ॥

॥ శ్రేయోదాయకమైన మార్గములలోఁ జిత్తమ్ము హత్తించి య
న్యాయప్రాపకదుష్ప్రవర్తనములం దాసల్ విసర్జించి త
న్నాయుష్మంతులు సద్గుణాల్ వినుతిసేయన్ గీర్తినిం గన్న జ
గ్గాయమ్మన్ బతిభక్తిశీలను స్తుతుల్ గావింపఁగా శక్యమే ॥

॥ పరమమతులగు నాదిదంపతుల పోల్కి
యతులసౌజన్యసౌభాగ్యయుతులు నగుచుఁ
బ్రబలు జగ్గాయమకు నబ్బరాజుమంత్రి
వరున కుద్భవమైరి మువ్వురుతనయులు ॥

చం॥ తనయులు ముప్పురాప్యులు సదాశివరాయలు పెద్దవాఁడు
వని రఘునాథమంత్రిగుణవన్మణి రెండవవాఁడు సజ్జనా
వనుఁడగు సోమసుందరుఁడు ప్రాజ్ఞుఁడు మూఁడవవాఁడు గా
త్రినిగడియింప సాగిరి సుకీర్తవనీయ యశోఽభిరాములై॥

తే॥గీ॥ కామమయు నఖిలాండాంబికయును రత్న
మాంబయును రంగనాయకమ్మయు మఱి శశి
లేఖమలు పుత్రికామతల్లికలు గాఁగ
జగ్గమాంబాబ్బరాజు లుచ్చతను మనిరి॥

చం॥ పతి పరలోక మేగఁ దన బాలుర వృద్ధికిఁ దెచ్చి విద్యయు
చతురత నభ్యసించుటకు సాయమొనర్చి వివాహకార్యముల్
వితతశుభంకరంబుగ నవేలముదంబున సల్పి కీర్తిసం
గతయయి ప్రాజ్ఞురా ననగఁ గ్రాలెను జగ్గమసాధ్వి ధన్యయై

గీ॥ రామస్వామితనూజను
ఆ మాణిక్యాంబ పెండ్లియాడెను విద్యా
కామి సదాశివసచివ
గ్రామణి గీర్త్యైకవిచ్ఛిభూమణిగుణియై॥

మ॥ పతిసేవాపరతంత్రభాగ్య మది లోపంబై చనన్ భక్తిస
న్మతియై మించి సదాశివాంఘ్రియుగచింతన్ బూని తన్నామ
గతి యంచున్ జపియించుచున్ దలచుచున్ కాంతాజనానం
ర్గీతచారిత్రవిశేషయై వెలసె మాణిక్యాంబ సచ్ఛీలయై॥

కం॥ శ్రీసోమసుందరుఁడు గుణ
భాసురుఁడై ముత్యమనెడి ప్రాజ్ఞునకు దయా
వాసునకు దత్తుఁడై కవి
తాసంగతిఁ గాంచి కీర్తిధనము గడించెన్ ॥

గీ॥ సోమసుందరరాయ విశుద్ధచరితుఁ
డధికప్రీతిని శేషగిరమ్మ నెలమిఁ
బెండ్లియై తోడి యువకుల వినతులంది
సూణరాజసభోద్యోగయుక్తుఁ డయ్యె ॥

ఉ॥ రెండవ సూనుఁ డార్యనుతరీతియుతుండు రసాభిరామవా
ఙ్మండనమండితుండు రఘునాథసమాఖ్యుఁడు కీర్తికామినిన్
నిండు ముదంబుతో జగము నిండ నటింపఁగఁ జేసె నీసుధీ
రుండై కృతిన్ గొనెన్ గవివరుల్ తను శ్లాఘనసమాచరింపఁగన్ ॥

చం॥ సరసుఁడు వ్యావహారికవిశారదుఁ డాంధ్రకవిత్వతత్వభా
స్వరుఁ డతిధార్మికుండు విలసత్తరవైద్యవిశేషవేది సు
స్థిరశివభక్తితత్పరుఁడు ధీవరుఁ డౌ రఘునాథరాయుఁ డి
ద్ధరఁ దనకీర్తిచంద్రికల దాల్చి దిశల్ ప్రభ లీనుచుండఁగన్ ॥

మ॥ వరమాతామహదుగ్ధవారినిధిభాస్వద్రత్నమై సత్కులా
భరణంబై పతిపాదభక్తి గల యంబాయమ్మ నా సాధ్వి ను
ర్వరఁ బెండ్లాడి సమస్తసౌఖ్యములగొప్పన్ మించి సంతోషవి
స్ఫురణన్ సత్యవతీకుమారికను నిమ్ముల్ మీరఁ గాంచెన్ ధరన్ ॥

## షష్ఠ్యంతములు.

కం॥ సరసాగ్రేసరునకు భా
సురకవితాభావలోలశుభగమనోజ్ఞాం
తరునకు ధర్మకళావి
స్తరునకు వ్యవహారధర్మతత్త్వజ్ఞునకున్॥

కం॥ ధీరస్తవనీయకళా
సారాచారాభిరామసౌజన్యునకున్
పారావారగభీర
స్ఫారునకున్ సుకవివినుతసద్ధర్మునకున్

కం॥ నిరవద్యభక్తిశీలున
కురుతరశంకరపదాబ్జయుగళీసేవా
పరిణద్ధహృదయపద్మున
కరిషితకరవర్తనున కహంశూన్యునకున్॥

కం॥ శ్రీరఘునాధసమాహ్వాయ
సూరివ్రజవర్ణనీయశుంభత్సుగుణా
ధారునకు జగ్గమాంబా
నారీపుత్రునకు సుకవినందితమతికిన్॥

వ॥ అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా రచింపంబూనిన చంద్ర
హాసచరిత్రమునకుం గథాక్రమం బెట్టిదనిన॥

# చంద్రహాస చరిత్ర.

## ప్రథమాశ్వము.

## కథా ప్రారంభము.

చం॥ ధరణిఁ గలట్టి పట్టణవితానము లందున నగ్రగణ్యమై
సరసుల కాటపట్టు ప్రశస్తసమస్తసువస్తునిస్తులా
కరము భర్మహర్మ్యమణికాంతిసమన్వితదిక్ప్రదేశమై
కరము వెలుంగు శ్రీపుర మగణ్యతరప్రమదానివేశమై॥ 1

చం॥ ధరణిసురాగ్రగణ్యులు విధాతృని మిం్రతు సమస్తవిద్యలన్
బురహరు మిం్రతు నిశ్చయము భూపకుమారులు శస్త్రయుక్తిఁ గి
న్నరపతి మీఱు ద్రవ్యకలనంబున వైశ్యులు మింతు రెందు, శ్రీ
హరిపద మాటు ధాన్యనిచయాళి హలాంకునిమిం్రసు పాదజుల్॥ 2

॥ తోటలా సరసంపుఁదేటలా నవకంపుఁ
బాటలా చెల్వారు తేటులలరు
పేటలా కొమరైన బాటలా సొగసైన
చోటులా సౌధాళికోటు లలరు
చేటులా యందంపు బోటులా సరసంపు
వాటులా నృత్యంపు నీటులలరు
కోటలా సద్భటకోటులా జవయుత
మోటులా ముద్దులమూటు లలరు

నవనవవిలాసభాసుర వివిధభాగ్య
నిరుపమానంబు విదళితసురపురంబు
శ్రీపురం బొప్పు లక్ష్మికిఁగాపురంబు
ఆపురమునకు సాటి రా దేపురంబు ॥

చం॥ అతులితహర్మ్యభాగముల యందుఁ జరించుచుఁ జంద్రికానిశా
వితతులలోఁ బురాంగనలు వేడుకకై శశిలోని జింకకున్
కృతకతృణాంకురంబులఁజిగిర్చెడి గారుడరత్నభూషణ
ప్రతతిని జూపి తోడిచెలువల్ నగఁ దామొనరింత్రు హాసమున్॥

చం॥ పురవరసౌధశుభ్రరుచి పూగముతోఁ ఘనమేనికాంతి చు
ట్టుటకము సల్ప సారెకుఁ దటాలున దూఱి గవాక్షమార్గమున్
బోఁవారి నేఁగు చందురుని ముగ్ధలు గైకొన హస్తనైల్యబా
ధురచులినాంకుఁడయ్యె ననఁ దోఁచుఁ దదంతరనీలరుక్ఛటల్॥

చం॥ పొల్లఁతుల యూర్పుతావులను బుట్టువునొంది దళత్పయోరుహ
ములకడవృద్ధినొంది పురపుష్పవనీరమణీయశాఖికా
స్థలముల నాఁజి తేఁజి తనుదాన దిగంతరమధ్యవర్తియై
మలయసమీరమా పురరమాపరిచర్యమొనర్చు నిత్యమున్॥

ఉ॥ ఆ పురమేలు మేలు భళియంచు జనుల్ నుతియింప నీతిశా
స్త్రాపనయప్రభుత్వకలనాయితసత్యశుచిస్థిరుండు ధై
ర్యాపరకాంచనాద్రి సుజనావనుఁ డంచితసద్గుణుండు సీ
తాపతిభక్తుఁ డొప్పు బహుధావిజయాఖ్య వహించి మించుచున్

ఉ॥ ఆతనిమంత్రి దుర్గుణగణాకరుఁ డాత్మసుఖప్రయోజనా
ధీతజనాపకారకృతదృష్ణివహుం డతిలోభియుక్ దురా
శాతతబద్ధచిత్తుఁడు ప్రజాపరిపీడనవర్తనుండు త
ద్భూతలనాథు మన్ననల బొందె చెలంగును దుష్టబుద్ధినాన్ ॥

చం॥ అతఁ డొకనాఁడు గేహమునయందున జ్యోతిషసారసాహితీ
యుతులును నాప్తులుక్ జెలగ నుండియు ముచ్చటలాడువేళఁ ద
త్సుతు వెనువెంట నాడుకొనుచుక్ జనుదెంచెను బాలుఁ డొక్కఁ డం
చితసుకుమారదేహుఁడు ప్రసిద్ధతరాభుఁడు కేళిలోలుఁడై ॥

సీ॥ కలువరాయని లేకగతిఁ గన్నులకు విందు
బొదలించు చదునైన నుదురుతోడ
చిరునవ్వునునుగాంతి చెంగావిచాయలు
విదలింపఁ జాలు కెంబెదవితోడ
కడకంటిచూపుల గఱికఱికలతోడఁ
గడతేఱు తెలిసోగకనులతోడఁ
బదియాఱువన్నెల పసిమి హొరంగును
సరస మాడెడి మేని చాయతోడ

గీ॥ వెడఁదనై పీనమై లచ్చివిడిది యనఁగ
వరలు శుభకరమైన పేరురముతోడఁ
గన్నులకు వింత వింత చక్కందనంబుఁ
గూర్చు నబ్బాలు వర్ణింపఁ గొలఁది యగునె ॥ 52

కం॥ చెలువము లకు గని యగు నా
మెలఁబ్రాయపుఁ గుఱ్ఱవాని కేలిక మెవరో
తలిదండ్రు లెవ్వరో యది
తెలియఁగ రా దతని చెలువు దృక్కులఁ దనుపున్ ॥

చం॥ తమకడ కేఁగుదెంచిన సుధానిధిఁ బోలిన మోమువాని శ్రీ
రమయిలు నా విశాలముగ రాజిలు వక్షమువాని రాజచి
హ్నములఁ జెలంగు వాని శుభ నాయత నేత్రయుగంబు వాని చి
త్తములను మెచ్చు జోస్యుల విధంబును గన్గొని మంత్రి యిట్లనున్

గీ॥ నాసికల వ్రేళులుంచి విన్నాణముగను
చూచుచుంటిరి చిత్ర మిచ్చోట నేమి
కల దటన్న నమాత్యుముఖంబుఁ గాంచి
పలికి రిట్టుల మర్మసంకలితఫణితి ॥

చం॥ మనసిజు నేలు నవ్యసుకుమారతరాంచితసుందరత్వమున్
వనజవిశాలలోచన శుభంకరసన్ముఖమండలంబునున్
గనుగొని మెచ్చుకొంటి మనగా నిది గాదు వచింపుఁడంచు
రిని బలవంత పెట్టె వివరింపుఁడటంచును మంత్రి కిన్కతోన్ ॥

గీ॥ క్రూరుఁడగు వీని దక్షిఁ గలకొలఁది బలుకఁ
గలుగు నీ పసివాని కిక్కటులు కొన్ని
నిజము వచియింప కున్న మన్నింపఁ డీత
డంచుఁ దలపోసి జోస్యు లిట్లనిరి భీతి ॥

చ॥ తమకడఁ దాపఁగా దరమె ధాత్రిపసత్సభమంత్రి శేఖర
త్వమునఁ జెలంగి మాదృశుల ఁబాలన సల్పు ప్రధాను లౌట స
త్యము వచియింతు మీ శిశువు నందునఁ గల్గిన రాజచిహ్నముల్
భ్రమ గలిగించె నీతఁ డొక పట్టున నిప్పురి నేలు యోగ్యుఁడై ॥

చ॥ అని వచియింపఁగా హృదయ మందున శూలము గ్రుచ్చుకొన్న భా
తిని కడు గష్టమైన వెలితిన్ బచరింపక పేర్మి జోస్యులన్
గనుగొని వీని జాతకమునన్ మన రాజ్యరమాపురంధ్రి యీ
తని వరియించు రీతి కలదా! యటులేన్ వివరింపఁ గాఁదగున్ ॥

కం॥ అని యిటు బల్కిన మంత్రికి
వినుపించిరి జోస్యులిట్లు పృథ్వీపచిహ్న
వను ఁడీబాలుం డాపద
లను గాంచఁడు సౌఖ్యముగఁ జెలంగును సుమ్మా॥ 61

సీ॥ అని జోస్యుల్ వచియించు వాక్య మది శూలాకారమై శ్రోత్రపా
ళిని గాఢంగను గ్రుచ్చ నప్పటికిఁజాలింపించి యవ్వారలన్
జనఁగా నాజ్ఞ యొసంగి యేకతమ చింతన్ మున్గి యీరాజ్యల
క్ష్మిని బాలింపఁగ నన్యుఁ డర్హుఁడగు భంగిన్ గాంచి సైరింతునే॥

॥ విజయసామ్రాజ్యంబు నిజపుత్రు భుజపీఠి
నలరారు నంచును దలఁచు చుంటి
శ్రీపురరాజ్యలక్ష్మిసాదరమునకు
నేను తావలమని యెంచుచుంటి

మంత్రిత్వమేల సామ్రాజ్యాధిపత్యంబు
దొరకు నటంచని మురియుచుంటి
రాజాధిరాజునై తేజోధనంబు నా
ర్జించఁజాలుదు నని యెంచుచుంటి
గీ॥ ఆశలన్నియు విఫలంబులై నశింప
పృథులదుస్తరగర్భ దారిద్ర్యయుతుఁడు
మామకీన ప్రశస్తసామ్రాజ్యభరము
సర్వమును దాల్పఁ గలఁడట సైచుటెట్లు॥
ఉ॥ దిక్కొకరుక యితఁడు లేక కడు దీనతదోఁపఁగ నన్నవస్త్రముల్
చిక్కక మత్కుమారకుని చెల్మికిఁ జేరుచు నున్నవాఁడు వీఁ
డెక్కడివాఁడో యేమొ మన కేల యొసంగుఁడు కూడు గు
చక్కట! చేరఁ దీసితిని ఆపద మూలక మైన యాతనిన్ ॥
తే॥ గీ॥ ఏది యెటులైన నగుఁగాక యితని నిపుడె
యమపురవరాభిముఖుని జేయంగ వలయు
దాన శమియించు మన్మనస్తాపమంచుఁ
దలఁచి తలవరులను గాంచి పలికె నిట్లు॥
ఉ॥ నమ్మిన బంట్లు మీరు జననంబును గాంచుటలాదిగాఁగ మా
సమ్ముఖమందుచర్య ముదల సల్పుచు నుంటిరి నేఁటి దాఁక గ
ప్య మ్మగు నట్టి కృత్యముల పట్టున మీవలెఁ జేయువారు శే
న్య మ్మని చెప్ప నొప్పుఁ బురియందని వారిని నచ్చఁ బల్కు చ

ఉ॥ పాప మటంచు నెంచకయె బాలుని కంఠము మీ కరాసిచేఁ
బాపియు నానవా లవయవంబులలో నొకడించు తెంపు పోం
డీ పనియందు మాంద్యమొకయింతయుఁగాంచఁగరాదు దీనిచే
దాపర మౌను మేలగు విధంపుముదంబు విశేషలక్ష్మియున్

మ॥ నిలుపన్ బూనెద మద్గృహంబునను వానిన్ నేఁడు మీవల్ తమం
బెలమిన్ దిక్కులనిండ రమ్మనుచు నెంతే వారిఁ బంపించి తాఁ
దలఁచెన్ వీఁడిఁకఁ జచ్చినట్లె మదిచింతన్ మానుమన్ బుత్త్రుఁడే
యిలఁ బాలించు నిజంబు తప్పదిఁక రాజేంద్రాభిమానంబునన్

చ॥ దురితతరప్రవర్తనులు దుష్టులు న్యాయము దప్పి కాననాం
తరమున ముక్కుబిడ్డ నతిదారుణకృత్యము సల్పనుండిరే
నరయఁగఁ జాలనంచు ఁజగమాద్రినిపాతము ఁగాంచె నాఁగ భా
స్కరుఁడపరాద్రికూటమునఁ గన్పడె రక్తకళాభిరాముఁడై॥

ఉ॥ నల్లని కాంతులన్ జెలఁగి నాలుగు దిక్కుల నిండెఁ జీఁకటుల్
తెల్లఁగ మిన్కుమిన్కు మని తేజముఁజూపఁగసాగెఁ దారకల్
ఫుల్లదశన్ వహించె సుమముల్ ముదమందిరి జారచోరులా
చల్లనివేళ నెల్లఱును శాంతిమయంబుగఁ నోఁచె నెమ్మదిన్॥

సీ॥ బాడికకందెనచాయ పరిభవించెను మేన
నేరండతైలంపు గార బూసి
చీఁకటి కంబళి విశేషనైల్యంబైన
నీలికాసెను కటిని బిగించి

వెగటుజుంజురు పల్లవెం|డ్రుకల్ కనరాని
లాగున వెడంద కుల్లాయిపెట్టి
ఏపె కంబపు రీతి హెచ్చైనర్వంగం జాలు
కరమున నొరగల కత్తినూని

గీ॥ తాళభూమిజము లనంగ (జాలి నట్టి
దీర్ఘతరకాయముం గల దిట్టలిర్వు
రెసంగ మెసంగెడి ముదమున నేగుదెంచి
రెలమితోడ నమాత్యుని గృహమునకును॥

కం॥ చేరిన తలవరులకు దయ
వారక గని బాలుం జూపి ప్రౌఢత మీరల్
దీరుప వలె నీవధ నె
వ్వారలు గనకుండు నట్టి వైఖరి తోడన్॥

ఉ॥ నిద్దుర నందు బాలుని వనీస్థలి చేరెడు నంతదాక మీ
రొద్దిక సందడింపక ప్రయోజనముల్ బొనరించు టొప్పుగా
కుద్దవిడిన్ వడిన్ కలంత నొందియు మేల్కనెనేని కీడు మీ
వద్దకు (జేరు జాగ్రత కృపాపరతంత్రత (బూన హానియా॥

చం॥ చనుండన బాలుమంచమును జయ్యన మూపులపై ధరించి త్రో
వను విడి దొంగదారి బడి పాదములెల్లను గాడు కంటకా
ళిని గడు బాధనొందు చవలీలను ఘోరతరాంధకార భా
జన మతిఘోరవన్యమృగసంకులమా వనసీమ (జొచ్చుచున్॥

సీ॥ ఘోరసైంహికవారసారభయావహ
గర్జాధ్వనులఁ గొంత కలఁత వడుచు
అశనదిదృక్షా క్షిపితసైకశార్దూల
జాలనిస్వనముల సడలు వడుచు
భీకరపైశాచికాకృతసంకుల
కోలాహలంబుల గూల వడుచుఁ
గాలకూటవిషాగ్నికలితాహినిశ్వాస
వాయుతాపంబుల వాలఁ బడుచు
గీ॥ ఫేరునిష్ఠురసంరావవికటసంగ
సైకపృథుసిస్వనంబుల నడలు వడుచుఁ
గంటకక్ష్మాగుహాకుడుంగగాఢ తాడి
తావయవు లౌచుఁ జేరి వనాంతమందు॥

ఉ॥ అంధుల బోలియున్న మన మాచరణంబు నొనర్చు టెట్లు వే
యింధన పాళి సేకొని యిచ్చట ప్రోవొనరించి యగ్నిసం
బంధము గల్గఁ జేయఁగ సమంజసమౌ తరువాత బాలునిన్
స్కంధవిహీను జేసి చనఁ గల్గుదు మంచు దలంచి యెంతయున్
గీ॥ ఇంధనంబులు గొని తెచ్చి యందు వహ్ని
రగుల జేసియు వెల్తురుగాగఁ గనిరి
తలవరులు మన్మథాకారు లలితచంద్ర
హాలు సచ్ఛీలు మృదులగుణాలవాలు॥

చం॥ కనుగొని నంత లోపలనె గాఢభయార్ద్రమనస్సరోజులై
ఎనసిన ప్రేమ ఖడ్గముల (బృథ్విపయిన్ బడనేసి కొంతసే
పునకు వనమ్మునన్ మఱచి పూనిన కార్యము నిర్వహించి త
యనువున( బోవనేర్తు మని యాంతరసీమ వితాకు నందుచున్

ఉ॥ మంచియు( జెడ్డయుం చనెడు మాట నెఱుగ(డు గిల్ల(జెక్కు(
గుంచెడు పాలు గారు ననుగున్ శిశుతన్ జెలువారు చున్నవా
డంచిత గాత్రు( డెట్టుల (గరాసిని గుత్తుక కోయ నాను యీ
పంచశరాంచితున్ సుకవివర్ణితచారువయోవిలాసునిన్॥

ఉ॥ జీవము తోడ నున్న( బరిశీలన జేయుచు సజ్జనాళికిన్
దావల మై సమస్తవసుధాపరిపాలనమాచరించి దు
ర్భావుల (జెండి ధర్మము విరాజిల( జేసి యశంబుచెంద నౌ
శ్రీవిభవాస్పదం బయిన చిహ్నలు గస్పడె బాలు( జూచినన్॥

కం॥ అని యొకతలవరి బాలుని
గని పల్కిన యొండొకండు కడునబ్బురమున్
గని వెల్గున దినమణియన
గను నొప్పెడు బాలుముఖము కని కరమొదవన్॥

ఉ॥ ఇంతటి ప్రేమ నెమ్మదిని నెన్న(డు జెందను మత్కరాసిచే
నింతకు నెంతమంది తెగి రియ్యెడ( జింత యొనర్ప నేల నే
పొంతకు( బోవ నెంచ( బదముల్ వణకంగను సాగె నౌర వ
న్యంతరమందు డించి చన నాత్మ( దలంకు సుమీ క్రమంబుగన్

ఉ॥ గోణమునైనఁ దాల్చు తెరగుల్ గన డీఁశిశు విట్లు గావుగ్
ప్రాణముఁ బాపుఁ డం చిటులఁబల్కఁగఁ గారణ మేమియొక్కొ పా
షాణముఁ బోలు నెమ్మది విచారముఁ గూర్పదె విన్నవారు వి
న్నాణము నందరే మునమునగ్ గృప వీడుట పాడి యానెకో

కం॥ కలుకుక రాసిని శిరముల
నలుకితి మిచ్చోట మనమునగ్ గృపఁ గననే
కలువాటను నీ బాలుని
తెలుగున కార్ద్రిత వహించి తెలివిడి నైతిగ్ 85

సీ॥ మంచియుఁ జెడ్డయుగ్ మాట యెఱుంగని
శిశు వపకృతి యేమి చేసె నొక్కొ
ఒక చెంపఁ బాలు వేఱొక చెంప నెత్తురు
వెలయు బాలుం డేమి సలిపినొక్కొ
తల్లిదండ్రుల పేదతనమున నడయాడు
పిల్లఁ డేచిక్కులఁ బెట్టె నొక్కొ
అన్నవస్త్రములకు ననదయౌ పసివాఁడు
తనకెట్టి యిక్కటుల్ దార్చె నొక్కొ

గీ॥ అర్ధరాత్రంబు నందు మహాంధకార
బంధురాటవిలోఁ జంపఁ బంపుటకును
కరుణ హృదయంబు నందునఁ గలదొ లేదొ
చండదుష్కార్య పరునకీ సచివమణికి 86

చ॥ తల నఱకుం డటంచు నటఁ దాను కృపారహితాశయుండునై
పలుకును గాక నంతటనె బాలుని దీనునిఁ జంపఁ బూను చేఁ
తలకుఁ గరంబు లాడునె వృథాగను గోపవిహీనుఁ డౌటఁ జేఁ
గలఁక వహించె వీని పిడఁగా హిత మంచును బల్కి వెండియున్

గీ॥ హత్య యొనరించి యానవా లవయవంబు
లందు నొకదాని తెమ్మని యాజ్ఞ యొసఁగెఁ
గాదె చంపక యున్నచోఁ గలుగు టెట్లు
చిహ్న మంచని మదిలోనఁ జింతఁ జేసి 88

ఉ॥ బాలునియంగముల్ గడపి ప్రాణముఁ బాపక బాధముంపఁగా
మేలొకొ చిహ్నముల్ గొనక మేము జనన్ సచివుండు కోపియై
కూలుచు మమ్ము నెట్లయినఁ గొల్వదు చిత్తము వీనిఁ జంప మా
యేలిక హత్యనమ్ముగతి నీశిశురక్షణ చేయు టెట్లొకో

తే॥గీ॥ అంచుఁ దలపోసి బాలుని యవయవంబు
ళందు దృష్టిని నిగిడించు నంతఁ బాద
తలమునం దారు వ్రేళ్ళుంటఁ దెలిసి చిత్త
మందు నాయురుపేతుఁ డం చలరి యంత 90

గీ॥ బ్రతుకుమీ జీవుఁడా యని పాదమునను
గల్గు మిక్కిలి వ్రేలును గత్తిచేతఁ
గోసి తా మానవాలుగాఁ గొనుచు బాలు
సేమ మరయుఁ బ్రార్థన చేసి రట్లు

ఉ॥ ఘోరతరాటవిన్ శిశువొక్కండె వసింపఁగ నుండ వీని నీ
చాపకృపాప్రభావమున సాఁకి యనుగ్రహమున్ వహించి యీ
ధారుణి పైని వత్సరశతంబు వసింపఁగఁ జేసి కావవ
య్యా! రఘురామచంద్ర! భవదంఘ్రియుగంబులు సంస్మరించెదన్

గీ॥ కరిని బ్రోచిన వేల్పవు గాన వంత
గాంచు ధ్రువుఁ బ్రోచినట్టి యఖండమతివి
చిఱుత నీకుఱ్ఱనాని రక్షింపుమయ్య
హానిసంచయగేయ రమాద్వితీయ 93

ఉ॥ తారలు కాంతిమాయ జనతండము నిద్రలఁ బాయ పక్షులెం
తే రహిఁ గూయ చీఁకటులు తేజమువాయఁగఁ గల్వదాయ తాఁ
దూరుపుకొండ నెత్తములఁ దొల్తటి సంజమెఱుంగురంగు సిం
గారము నింపఁగాఁ దొడఁగెఁ గార్మొయిళుల్ గనె నూతనచ్ఛవుల్

చ॥ తెలతెలవారె దిక్తటులు తేజముఁ బూనెను ఘోరసత్వముల్
తొలఁగి గుహాళిఁ జేరఁజనెఁ దోయజముల్ వికసించె సర్వజీ
వులు తెలివిన్ వహించిరి విభాతివిధంబునఁ దారకాచ్ఛటల్
కల తొలఁగెన్ గ్రమక్రమముగాఁ దొలఁగెన్ వితతాంధకారముల్

ఉ॥ సంగడికాఁడు వచ్చె నిఁక సాగవె యాటలటంచు నెంచి క
న్నుంగవపైని కాటుక వినోదముగాఁ బచరించి కుల్కు చ
న్నుంగవపైని బైటనిడి నూత్నరిరంస చెలంగ నేగుక్షిత
న్వంగుల రీతి పంకరుహవారము నీరము నందు భాసిలెన్

చ॥ గరులు విదల్చుకొంచుఁ బతగంబులు త్రిమ్మరసాగె భూజపుఁ
దొఱటలలోన ఘూకములు దూరఁగసాగె మృగేశసంఘము
ల్గిరిగుహలందు మత్తునఁ జలింపక నిద్దురఁ బోవసాగె భా
స్కరుని నవాంశుమండలిని గన్పడసాగెను తైక్ష్ణ్య మత్తఱిన్

చ॥ కలితపయోజరాగములు గా నొక కొంచెము సేపు మౌక్తికం
బులుగను గొంతసేపుఁ గపుఁబొల్పగు శారదమట్లు కొంతసే
పల వనజాతబంధుఁడు నిరంతరవృద్ధిని గాంచుచుండఁగా
జలరుహపత్రవారికణసారరుచుల్ కనుపట్టె నంతయున్

గీ॥ ఇట్లు తలపోసి తలపోసి యాశ్వరేచ్ఛ
కొలఁది జరుగును చేచేత కుఱ్ఱఁజంపు
కంటె నివ్వని డించుట కర్జమంచు
నట్లొనర్చియుఁ జనిరి గృహంబుఁ జేర ౮౯

మ॥ అటు చారుల్ చనినంత ఘోరమృగజాలాభీలరావావృతా
ర్భటులన్ బెగ్గిలి యేక్షి బాలుఁడు దిశాభాగాళి మార్గోన్ముఁయను
త్కటతత్స్వనము నాలకించి పఱచెన్ తత్క్రూరవన్యాళు లా
చోటు వే వీడియు నీశ్వరామలకృపన్ శుద్ధాంతరంగంబునన్

చ॥ ఘనతరకాననాంతరము కన్నులు గానని యంధకారముల్
పెనగొనఁ బుండరీకముఖభీకరఘోరదురారవార్భటీ
జనితపృథుధ్వనుల్ భయవశంవదుగా నొనరించు ధైర్యవం
తుని నపుడిట్టి [illegible] గాళిక్రిన్

గీ॥ ప్రాగ్భవంబున నెటువంటి పాపతండ
ములు నొనర్చెనో యేమొకో తెలియఁబోదు
కాని కడుబాల్యముననె జగంబునందుఁ
గలుగఁ బోవని యిక్కట్లు గల్గెఁ బెక్కు 102

మ॥ తను నోదార్చెడి వారు లేమి వనసత్త్వక్రూరసంరావసం
జనితప్రస్ఫుటభీతిఁ బాదమున నిచ్చల్ గల్గు పెన్బాధయున్
పెనగో నేడ్చుచు నుండె నేలఁబడి యొంతేఁ దాఁ బదార్వన్నె కాం
చనముం బోని శరీరకాంతులు రజచ్ఛన్నంబులై మించఁగన్

తే॥గీ॥ దిక్కు లేనట్టి వారికి దేవదేవుఁ
డొక్కకంటను దిక్కుగా నుండికాచు
ననెడి లోకోక్తి నిశ్చయ మయ్యె జుండు
బాలుఁ డాపద లొందవక బడలకుంట

కం॥ అర్భకుఁ డా యటవీస్థలి
నిర్భరకష్టములతోడ నెమ్మది పొగులన్
దుర్భరవేదన గను సం
దర్భమ్మున రవి నభఃపథంబునఁ గ్రాలెన్ 105

ఉ॥ శ్రీపురరాజ్యలక్ష్మికిని జేరిక కప్పముఁ గట్టువాఁడు ది
గ్వ్యాపితకీర్తి సద్గుణగణాత్తచరిత్రుఁ డుదారమానసో
ద్దీపితుఁ డార్యపూజితుఁడు ధీవిభవుండు పుళిందనాముఁడన్
కాఁపురముండు శోణకటకంబును నేలుచు సత్యసంధుఁడై

సీ॥ పౌరావళిని గాన్పుభంగి పాలించుట
రామరాజ్యం బనరాదె యంచు
దానధర్మముల సతం బొనరించుట
కల్పభూజం బనఁ గాదె యంచు
ఈతిబాధాప్రమాదార్తిశూన్యం బౌట
సత్పాలన మనంగఁ జనదె యంచుఁ
బ్రవిమలసాడ్గుణ్యవర్తన గల్గుట
ధర్మరా జని పిల్వఁ దగదె యంచు
గీ॥ వినుతి యొనరింప నెగడె సద్విపులబాహు
బలవిరాజితవిక్రమప్రాభవుండు
వైరిసంహారచణసమిద్ధారివిజయ
కాంతుఁడైన పుళిందసామంతనృపుఁడు
ఉ॥ ఆతనిజాయ నాథునిపదాంబుజముల్ మదినిల్పి సేవలన్
బ్రీతిని జేయు చాపుళను బ్రేమను గాంచు ధరన్ బతివ్రతా
ఖ్యాతలలో శిరోమణిగ నంచితకీర్తి ధరించి మించె తే
జోతిశయంబు ధార్మికగుణాతిశయంబు తనన్ వరింపఁగన్
కం॥ ఆయమ నెమ్మనమునఁ జిం
తాయత సంతానవాంఛ దరికొన భర్తన్
కాయజసమనవమోహను
నాయెడఁబొడఁగాంచి తెల్పె నాత్మవ్యథలన్

ఉ॥ వాసన లేని పుష్పమును, భావము లేని కవిత్వశైలి, వి
శ్వాసము లేని బంటు, బుధవర్గము కల్గని యోలగంబు, వి
ద్యాసరసం బెఱుంగని ధనాంగనయున్, గొమరుండు లేని సు
శ్రీసముపేతజీవనము, చెందును వ్యర్థము నంద్రు కోవిదుల్

తే॥గీ॥ సారశృంగారకలితసంసారవల్లి
నుదయ మందిన ఫల మనియెదరు పుత్రు
ఫలముఁగాంచని తీఁగ కైవడిని సుతుని
గనని సంసారమును వ్యర్థకారణమ్ము 111

ఉ॥ ఇవ్విధి మానసవ్యథల నెల్ల వచించి విచారమందు నా
జవ్వని చెంతఁ జేరి యల క్ష్మాతలనాథుఁడు బుజ్జగించి నీ
వెవ్వగ మానుకొమ్మ తరుణీ సుకృతాతిశయంబు లేనిచోఁ
బువ్వులు ముల్కులౌను గద పుణ్యఫలంబు లలంఘ్యముల్ గదా

ఉ॥ నోములనోచి వేలుపులనున్ బరితృప్తుల సల్పి దేవతా
స్తోమసపర్యలన్ నెరపి సూరికదంబము నాశ్రయించి గా
థామృతపానమున్ సలిపి యన్వయపావనమున్ బొనర్చు చు
న్నాము రమేశుఁ డెట్టులఁ గనండు సుతార్థుల నన్ను నిన్ సఖీ!

కం॥ అని యాదరించి ప్రభువరు
వినియోగము వలన నేఁడు పృథ్వీపాలున్
గన బోవలెఁ ననుసంగతి
మనమునస్ఫురియింపఁ బలికె మగువకుఁ బ్రీతిన్ 114

చ॥ తలఁగకు మేను భూధవుని దర్శనవాంఛను బోయి వేగ ని
మ్ముల నరుదెంచు వాఁడనని పొల్పుగఁ దాఁ బరివారయుక్తుఁడై
వెలలియు శ్రీపురంబుఁ గని వేడుకఁ దత్ప్రభుసత్సభాస్థలిన్
గలపనులెల్లఁ దీర్చి నిజనాథునిమన్నన లంది యంతటన్

కం॥ సెలవున్ గైకొని మిత్రుని
వలనన్ గైకోలు వడసి మించిన వేడ్కన్
జెలువారుచు నిజపురికై
యలరఁగఁ బరివారయుక్తుఁడై చనసాగెన్

వ॥ ఇట్లు కతిపయప్రయాణంబుల సాగి నిజపురాభిముఖుండై

మ॥ కనియెన్ సాలరసాలపాటలశమీకారం బపిండీకరో
చనబిల్వామ్లశమీరతిష్యఫలవిష్వక్సేననింబాభయా
పనసాశోకాంబుజకర్ణికారగణికాభస్మరశేఫాలికా
ర్జునహింతాలజయాదరీకరకభూరుడ్వ్యాదికాంతారమున్

మ॥ పరివారంబులు తోడ రాఁ దరిసి సంభావించి సంతోషసా
గరలోలాత్మపరీతుఁడై యడవి చక్కన్ జూచి యాపైని దా
నమగన్ వచ్చు నటంచు నెంచి తన నెయ్యంపున్ సఖున్ బిల్చి యం
తెరఁగెల్లన్ వచియింప నాతఁ డటులెంతేఁ జేయఁగాఁ బంచినన్

కం॥ విడిదికి ననువగు స్థలమున్
దడయక కని యచట విడియఁ దగునని డేరా
గదియించి సువారమ్ము సు
ఖదగతి చేయంగ సేవకాత్తతి బూనెన్

చ॥ పరిసరభూములన్ గలుగు వన్యకుజామలసుందరప్రభా
నిరతిని జూచి వత్తుమని స్నేహితుఁ జీరియు వెంటరా వనాం
తరమున కేగె నాతఁడు ముదంబున నచ్చటి చిత్రలీల దా
మరయుచు సంచరించు నెడ నార్తనినాద మొకండు దోఁచినన్

కం॥ తలపఁగ నిర్మానుష్యము
కలితాధికవన్యమృగవికారము సభయా
కుల మివ్వన మిటఁ గనవినఁ
గలిగెడు రోదనము దీని కారణ మేమో ! 122

వ॥ అని తలపోసి యాతఁడు వనాంతరమందున రోదనధ్వనిన్
వినఁదగు నాప్రదేశమును స్నేహితుఁ దోడ్కొని పోయిగాంచె బా
లుని రుధిరప్రసిక్తపరిలుప్తతరాంగుళుఁ జంద్రబింబశో
భనవసుందరాస్యుని స్వభావకళాకలితాభిరామ నిన్

ఆశ్వాసాంతము

———

॥ కంజభవాన్వయాంబునిధికంఢితనూజ తనూజవైరిప
త్కంజసమర్చనాయితజగద్ధితమానస మానసార ధీ
రంజితకావ్యరాజరసరమ్యపదార్థవివేచనాలస
న్మాజుల శేముషీసుహితమంత్రిహితంకర భవ్యవర్తనా

మాలిని

సుగుణగణవిశాలా స్తుతసద్భక్తిజాలా
నిగమహితమనస్కా నిత్య భాస్వద్వచస్కా
విగతరిపుసమూహా విజ్ఞతాసత్ప్రరోహా
అగణితజనగేయా హారిలక్ష్మీవిధేయా

ఇది శ్రీ శేషాచలాధీశ చరణసేవాసమాసాదితకవితావిచిత్ర
దూపాటివంశపారావారరాకాసుధాకర
శేషాచార్యపౌత్ర వేంకటరంగాచా
ర్యపుత్ర శేషాచార్యకవిమిత్ర
ప్రణీత చంద్రహాస
చరిత్రమునఁ
బ్రథమాశ్వాసము





# చంద్రహాసచరిత్ర.

## ద్వితీయాశ్వాసము.

కం॥ శ్రీరమణీరమణకృపా
భూరిస్థితనిఖిలసుకవిబుధజనగేయా!
పూరితసుగుణామేయా
ధారా! రఘునాథరాయ! ధర్మవిధేయా॥

గీ॥ అనఘ! రింపు పుళిందధరాధిమౌళి
సఖునితోఁ దత్ప్రదేశంబు సరసకేఁగి
తచ్ఛిశువుఁగాంచి మదిని నత్యంతముదితుఁ
డై తలంపఁగ సాగె నిట్లనుచుఁ బ్రీతి॥

సీ॥ సంపూర్ణపూర్ణిమా చంద్రమండలశోభఁ
జెలువారు నీబాలు చిన్నిమోము
పదియారు వన్నెల పసిడిచాయలు దేఱి
తేజరిల్లెడు బాలు దేహకాంతి 2

కంతుజయాతు లెక్కకుఁ జేరనీయక
మిక్కటంబగు బాలు చక్కఁదనము
అనితరసుకుమారహారిపేశల మాచు
పలరారె నీబాలు నంగపాళి
బింబఫలకాంతిఁ దెగడెడి పెదవిసారు
రాజలక్షణలక్షితప్రతిభ గలిగి
నిర్మనుష్యము సంకులనిఖిలసత్వ
మీ వనంబున నిటులుండు టేమి యొక్కొ॥
గీ॥ ఘోరశార్దూలసింహసంకులము త్రస్త
ధావదేణీకులంబు పతన్మహీధ్ర
గండపాషాణశకలమా కాననమున
నొంటి నిబ్బాలుఁడెటులుండె నొక్కొ దలఁప॥
మ॥ పది మాసంబులు మోసి కష్టపడి యోపన్ రాని పెన్ వేదనల్గీ
గదియన్ సైచియుఁ గన్న యేజనని నిర్లజ్జావినిర్మోహియై
పొదలన్ ద్రోయఁగ నొప్పునే హృదయమేమో చిత్రమైతోఁచు
మ్మది కెవ్వారొ దురూహ బాలునిటు జంపం ద్రోచి రిచ్చోటునన్
సీ॥ కంటకతరుగుల్మకాండముల్ శయనింపఁ
బట్టుపరుపులె నీకు భవ్యదేహ!
శ్రవణకఠోరమా జంబుకనినదముల్
మృదుసూక్తులా నీకు సదమలాంగ!

పరజీవహననవిర్భరసింహజాలముల్
తలిదండ్రులా నీకు దైన్యమూర్తి!
పతగసంకులవనీభాగంబు జూడఁగా
గేహసీమయె నీకు కీర్తనీయ!
కఠినపాషాణశకలసంకలితమైన
కలికురానేల నిలువఁ గాఁ గల తలంబె!
సహజసుకుమారతనుయష్టిజాలసడల
నకటకట కాన నెటులుంటి వయ్య బాల॥ 6

కం॥ అగుఁగాక నేల చింతిల
విగతాపత్యమున గుంద వీనిని దయ శ్రీ
నగధారి యొసఁగెఁ గొనిచని
మగువకుఁ దెలిపియును బెంతు మమకారమునన్॥ 7

గీ॥ పాలు ద్రావెడి బాలుఁ డేవర్ణమైన
నాత్మసూనుని వలెఁ బెంచ నఖిలవర్ణ
ములకుఁ దగునని ప్రాజ్ఞులుల్ బలుక వినమె
యంచుఁదలపోసి చెలికాని కనియె నిట్లు॥

మ॥ చెలుఁడా! చూడ మదీయభాగ్యము ఫలించెన్ పుత్రవాంఛార్థినై
కలకాలంబు కృశించు చుండుటను శ్రీకాంతాధవుం డొంచి చిం
తలఁ దీర్పన్ దయచేసె బాలునిటు చెంతన్ జేర్చి గానట్టిచోఁ
గలుఁగన్ బోవునె ఘోరవన్యమృగవత్కాంతారమం దిట్టులన్॥

కం॥ అని ఘనసంతోషముతోఁ
దన సఖునకుఁ దెలుప వల్లె తగునని యచ్చా
లుని దరిసిరి కొనిచనఁగా
మనమునఁ దలపోసి వారమందరగతులై॥

కం॥ వారలఁ గని బాలుఁడు కర
వారిజముల నెత్తె వాని భావముఁ గనిమో
దారభటి నప్పులిందధ
రారమణుం డెత్తికొని పురంబున కేగెన్॥

మ॥ పరివారంబులఁ జేరి భోజనముఖవ్యాపారముల్ దీర్చి యె
ప్డరుగంగాఁ గలవాఁడ మత్పురికి నెప్డర్థాంగి కీసూను శ్రీ
హరికారుణ్యకటాక్షలబ్ధమని మోదస్ఫూర్తిమై నిత్తు నె
మ్మరుసంతోషముతోడనొప్పనదము నెయ్యుల్ బందుగుల్ మెచ్చఁగన్॥

మ॥ ఒకచో నేనియు నిల్వఁబోవక ప్రయాణోద్యోగముల్ దీర్చి చే
రికలో నాత్మపురంబుఁ గాంచి పనిచెన్ భృత్యాళినిన్ పట్టణం
బకలంకప్రభమై నలంకరణకృత్యంబుల్ బొనర్పంగ సే
వకులున్ జల్లిరి పుత్రలాభ పృథివీపాలాగతంబుల్ పురిన్॥

సీ॥ శృంగాటకముల భూషించియు నందందుఁ
దీరిచి రచ్చంబు తోరణములు
రాజవీథులు కడు రాజిల్లఁ బన్నీట
నలరఁ జల్లిరి కలయంపి మిగుల

కటకభిత్తికల చిక్కని సున్నముఁ మేది
పట్టితీర్చిరి మెఱ్ఱమట్టి మోరు
నిలయాంగణంబుల నలికి ముచ్చట మీఱ
నరలించిరా రంగవల్లు లెలమి
గవని గవనికి దేవుఁడు గాచుఁగాత
మంచుఁ గాంచనమషి వ్రాసి యలరఁజేసి
నవనవవిభూషణాంబరవివిధకుసుమ
భూషితులుగాగ నొప్పి రప్పురజనములు ॥ 14

కం॥ అంతట రవి యస్తాద్రి
ప్రాంతమునకు నేగె తమసమాశావితతుల్
దొంతరలై క్రమ్మెను శు
ద్ధాంతంబున దీపకళిక లలరారెఁ దగన్ ॥ 15

చం॥ ఇనుఁ డను జాతవేదుఁ డపు డివ్విధి యస్తధరాధరస్థస
ద్వనుల దహింపఁగాఁ బరగు ప్రజ్వలనప్రభయం చ నాఁగఁ గ్ర
మ్మెను కడు సంజకావిచవి మీఱెను ధూమమనంగఁ జీకటుల్
జనితకణంబులో యనఁగ సత్తతి మీఱె నభస్థలంబునన్ ॥

సీ॥ అస్తమానుండయి యాపెటఁ దీరక
పలురూపముల రవి వఱలె ననఁగ
గేహభిత్తికలకు గీలుకొల్పినయట్టి
మరకతాదికజాతి మణులనంగ

చీఁకటి యను చాందినీ కమరించిన
పొలుపారు నారస బుడ్లనంగ
రాజాగమార్గమై రాజిల్లఁ జేయఁగాఁ
గ్రాలెడి పెఁ దిపిటీ లనంగ
నలరె తారక లాకాశతలము నందుఁ
బ్రబలె దీపిక లాశోణపట్టణమునఁ
బౌరులమనంబు లానందపటిమ మించ
నాఁటి సంతోషవిషయచిహ్నంబు లగుచు ॥
కం॥ ధరణీసురవరు లిది శుభ
కరసమయం బంచుఁ జెల్వఁగాఁ బురిఁ జొరఁగా
ధరణీపరుఁ డరుదేరెను
పురకామినులుఁ నివాళిపుంజము లొసఁగన్ ॥
కం॥ రాజవీధుల నా ధరారమణవరాళి
పుత్రిసంయుతుఁడగుచును బోవుచుండ
వేడుకను గాంచ మదిని భావించిమించి
చంచలాక్షులు సౌధపార్శ్వములఁ జేరి ॥
చం॥ ఒక భ్రమరాభకుంతల రమోజ్జ్వలమై ప్రభుఁజూడ నడ్డమై
వికచసరోజనేత్ర లతివేలముగా నటనిల్వఁ బిల్చె నో
సకి! భవదీయభర్త యన చాన విచారముతోడఁ బోవఁగా
వికటతరాట్టహాసమునఁ బిల్చి నిలంబడెఁ దోడివారితోన్ ॥

చం॥ జలకము లాడఁచూడి యొక చాన ధరాధవుఁ డేగుచుండుటన్
దెలిసి కనంగ చీరె కటినిన్ బిగియింపఁగ మాని చేతకం
చెల ధరియించి పయ్యెటను చే సవరింపక చూచుచుండె భూ
తలపతిసోయగంబు కనుదమ్ముల కాంతులు తాండవింపఁగన్॥

గీ॥ మహితనైభవముల రాజు మార్గమెలమి
గడచి తన రాకకై వాంఛ గడలుకొనఁగ
నినుని దర్శనమునకు పద్మిని విధమున
నెదురుజూచు స్వకాంతను గదియు కొఱకు॥ 22

కం॥ త్వరత్వర తోడుత కక్ష్యాం
తరములు గమియించి హృదయతామరసము వి
స్ఫురితముదంబున మించఁగ
సరసకుఁ జనుదెంచె విభవసాంద్రుం డగుచున్॥ 23

మ॥ అటు సామంత నృపాలమాళి నిజసౌధాభ్యంతరస్థాన మా
ర్గఘటిమైఁ జేరి సమస్తపౌరులను నిల్వంబంచి భృత్యాళి న
చ్చోటుఁ బీడంగను నాజ్ఞలిచ్చి చెలులచ్చోఁ జెంత నే తేరఁగా
నటుఁ జేరన్ జనె స్వీయకాంతదరి కత్యంతోద్ధతుల్ మీరఁగన్॥

కం॥ ఎదురెదురు వచ్చి నాథుని
పదముల గాంగేయకలశభవ్యోదకముల్
వదలుచు గడగియు మణిగణ
గదితాసనమున వసింపఁగాఁ జేయుటయున్॥ 25

చం॥ తన యయనప్రచారమును తద్వన మందున రోదనధ్వనిన్
వినుటయుఁ జేరఁబోవుటయు వేడుక బాలునిఁ జూచుటాదిగాఁ
జనిన తెఱంగుఁ దెల్పి పెలుచన్ శిశువున్ దనచేతికిమ్మ్య సం
జనితముదార్భటిన్ జెలఁగె జాయమనోంబుజ మష్టు బ్రీతిమై॥

ఉ॥ దైవ మొసంగె వీనినిగదా మన కిచ్చను మెచ్చి కానిచో
యా వనసీమయేడ ? శిశు వాయెడ నొంటిగ నుండుటేడ? నీ
భావమునం దలంపు మతివా! జనియించెడి పుత్రమోహ మా
రా! వివరింప శక్యమగునా భగవంతుని మాయ యొంతయున్

ఉ॥ బాలునిఁ గాంచు టాదిగ నపత్యవిమోహము నెమ్మనంబునం
దోలి జనించె దైవమిడకున్న జనించునె ప్రేమ నేఁటికిన్
జాల ఫలించెగా తపము సంతస మబ్బె నటంచు బాలునిన్
లాలనఁ జేయసాగె సుతలక్షణమా యనురాగ మూనుచున్॥

ఉ॥ ఎంత భయంబు నందితివొ యేడిచి యేడ్చియు నెంతసాక్కితో
పొంతల సంచరించు మృగపుంజముఁ గాంచియు నెట్లు నిల్చితో
హంతకు లేరు నిన్నిటు వనాంతర మందునఁ జేర్చి చంపఁగా
మంతన మొప్పకే విడచి మా కుపకారము జేసి రంచొగిన్॥

కం॥ సదయత బాలుని నక్కున
గదియించియు పైటఁదుడిచి కాళ్లుగడిగియున్
మొద మెఱ్రనినీళ్ళచు వడి
ముదితలు దిగదుడిచి పారఁ బోసిన యంతన్

గీ॥ దనుపుఁ జెందెనో యేమొ నా కొడుకటంచు
భూతిమంత్రించి నోసటను బొందుపఱచి
పీడఁ దొలగించి యాకలి తోడనుండె
నంచు లాలించు చింత యాహారమొసఁగి॥ 31

గీ॥ చంద్రబింబంబుఁ బురిడించు సన్ముఖంబు
హాససంయుతమౌచు విభాసమాన
మగుటఁ దలపోసియును చంద్రహాసుఁడంచు
నామకరణం బొనర్చి రెంతో ముదమున॥ 32

సీ॥ మన పార్థివుఁడు లబ్ధతనయుఁడై నాఁడట
చూచి వత్తము రారె సుదతులార!
ఆ కళావతి నేఁడు చేకొన్నదట సూనుఁ
గాంచి వత్తము రారె కాంతలార!
దైవదత్తంబైన తనయుఁ డబ్బెను గాన
పోయి వత్తము రారె పొలఁతులార!
వనసీమనుండిన గొని తెచ్చి నారంట
యరసి వత్తము రారె గరితలార!

చంద్రహాసవిలాసప్రశస్తుఁడంట
పరగఁ గనుగొంటకును రారె పడఁతులార
యనుచుఁ దమతమ సఖియల కనుచు రాజ
సౌధమున కేగుచుండిరి సతులు ప్రీతి 33

చం॥ పలువురి కన్నులం బడిన బాలుని కెక్కడ దృష్టిదాకునో
పిలువక యేగుదెంచి రిటు వీరలటంచును బ్రేమతో సుతున్
దలచుచు నుండి రాప్తులు సదా తలిదండ్రుల రాగపున్ రసం
బెలమి పరిగ్రహించి సుతుఁ డింపెసలారె వినూత్నశోభలన్॥

గీ॥ ఈడుబాలురతో నాటలాడఁ బోయి
తడవు రాకున్న పరితాపమడర తల్లి
దండ్రు లింటింట వెదకింత్రు తనయు కొరకు
పుత్రమోహంబు లివిగదా పుడమి జూడ॥

ఉ॥ ఐదవయేడు వచ్చుటయు నాతఁడు నొజ్జలచెంతఁ జేరిఁ య
ష్టాదశవిద్యలన్ గరచె చండధనుర్నిగమాదిసత్కళా
సాధనయందు దక్షతను సత్వరమే గడియించె ధర్మసం
వేదవరేణ్యుఁ డయ్యెను సన్నిహితవర్తన నేర్చె పిమ్మటన్॥

ఉ॥ తల్లియుదండ్రియున్ గని ముదంబు వహింపఁగఁ బ్రేమపాత్రుఁడై
యెల్లవిధంబులన్ బ్రియమునే యొనరింపుచు నుండె బాల్య మ
ల్లన జారి యౌవనమహాప్రభ లొప్పఁదొడంగె మేనఁ గాం
త్యుల్లసితాననంబు జెలువారె తుషారకరాభిరాముఁడై॥

సీ॥ అతివిశాలంబౌచు నలరారె వక్షంబు
కర్ణాయతంబులై కన్నులొప్పె
వ్రణకిణాంకంబులై బాహువు లొప్పారె
నూనూగుమీసముల్ తోనదోఁచె

జాను లంబంబులై చనె కరయుగ్మంబు
కడగంటి చూపులు గానవయ్యె
వికసించి మించె నత్యకలంకత మనంబు
పరువుమర్యాదల దెలియ వెఱిఁగెఁ
దనరె పదియూరువన్నె కాంచనము కాంతి
దేహ మవయవసౌష్టవస్థితులు వెలసెఁ
జెందెఁ దరహాస మాననసీమ కలరెఁ
బాల్యమును వీడినంత యౌవనధనంబు ॥ 38

చ॥ అలరె వసంతమన్మథజయంతుల బోలిన సుందరంబు కాం
తలకు హృదంబుజంబునను దార్కొను శల్యము భాతినొప్పె చూ
డ్కులు జెలువారె యంగజుని క్రూరతరాస్త్రవితానమట్లు కో
ర్కులు తమయంత మించుచును రూఢివహింపఁగసాగె నెమ్మదిన్॥

గీ॥ నవనవవిలాసభాసురాననముతోడ
శౌర్యసాహసధైర్యముల్ సత్వమొందె
నరిగళవిలుంఠనోద్ధతిస్ఫురణ మెఱసి
శోభితావయవస్ఫూర్తి జూడనొప్పె ॥

గీ॥ భూవిభుని మంత్రియౌ దుష్టబుద్ధి రాజ
కార్యకరణప్రసక్తి నక్కడికి రాగ
నెదురుగా నేగి యాపులిందేశ్వరుండు
తోడుకొనివచ్చి పీఠమందునను నిల్పి ॥ 41

గీ॥ దుర్మతంబుల కీక్క, బంధువిహితాళి
పాలి పెనుకాట్ల కుక్క, సత్పాలనమున
కొప్పుగల తోకచుక్క, మనోంబుజంబు
రాతిముక్కగదా మంత్రిరాయలకును॥

కం॥ కోపము తాపము లేకయె
యీపురి యానలకుఁ బంపు పెట్లాతండో
పాపాత్ముఁడు గద బాలునిఁ
జూపోపునె యంచు నెంచుచున్ విసయమునన్॥

కం॥ కుశలప్రశ్న మొనర్చియు
ప్రశస్తచరిత్ర! తామువచ్చుటచే సా
దృశరహితకృతార్థత మ
ద్వశమయ్యెఁగదయ్య మంత్రివర్యా! స్థైర్యా॥

చ॥ తమరిట వచ్చుటన్ కడుముదంబున ధన్యుఁడనైతి నేఁడు సా
ధమును బవిత్రమయ్యె ధనధాన్యసమృద్ధులు గల్గఁగంటి మ
త్సములిక నేరు మంత్రికులచంద్రమ! మత్తపమెల్లఁ బండె నం
చమితమృదూక్తులన్ సచివు నల్లన సన్నుతులన్ బొనర్చుచున్

కం॥ ఇటు లిష్టాగోష్టీవిధి
నటనటఁగల రాజకీయహారిమృదూక్తిన్
పటుగతి మాట్లాడఁగఁ దా
నటుజేరన్ వచ్చె చంద్రహాసుండంతన్॥

క॥ వచ్చిన వానిని గనుగొని
యచ్చెరువడి జూచుచుండు నాతని కనెనో
సచ్చరితా! మత్సూనుఁడు
వచ్చెను త్వద్దర్శనాభివాంఛితుఁ డగుచున్ ॥ 47

చ॥ అని మనవిన్ బొనర్చి తనయా! సచివాగ్రణి వీరు, వీరికిన్
వినతిఁయొనర్పుమా యన నవేలతరానతులన్ బొనర్చు వా
నినిఁ గని యాతఁడెన్నఁడు జనించెను మీకిటు సూనుఁడయ్యె నం
చని యడుగంగ పల్కె సచివాగ్రణి కాతఁడు కౌతుకంబునన్ ॥

సీ॥ నాడు శ్రీపురికేతెంచి నాథుదర్శ
నము నొనర్చియు ప్రభుని యానతిని మరలి
మత్పురంబున కేతెంచు మార్గమునను
గల్గు వనమధ్యమున యందుఁ గంటివీని ॥ 49

గీ॥ రక్తసిక్తంబునైన చరణమునందు
త్రేలొకం డారవడి దెగి వెన్కముందు
జాడలేనట్టి యిబ్బాలు సాదరమున
నెత్తి పురిజేర్చి పెంచితి మింతదనుక ॥ 50

సీ॥ ఈతిబాధావిహీనాతిసౌఖ్యస్ఫూర్తి
వరలఁజొచ్చిరి సుమ్ము పౌరవరులు
నెలమూఁడు వాన లెన్నికజేయ వర్షింప
సత్ఫలప్రదయయ్యె సస్యసమితి

ఆబాలగోపాల మానందతుందిల
హృదయాబ్జులై యుండ నెసఁగెఁ బురము
ఇంటింట గాదెల కెక్కువై రాసులై
తనరారె నంతయు ధాన్యచయము
బాలుఁ డిప్పురిఁ జేరిన కాలమాది
పుత్రమోహాభిమానముల్ బొదల పెంచు
చుంటి మీతఁడు తలిదండ్రికంటె మమ్ము
మహితభక్తిని గొలిచెడు మంత్రివర్య ॥

కం॥ అని వినుపించిన నెమ్మది
ఘనశిల బడినట్టులై జగావెతఁ గొలుపన్
గననీయక వెను జేసియు
ననుమోదము జూపి యిట్టులను సచివుండున్ ॥

ఉ॥ సంతసమయ్యె దేవుఁడె యొసంగెనటంచుఁ దలంతుఁ బ్రేమ న
త్యంతముదంబునన్ బెనుప నాసుడి బాలుని నంచుఁ బల్కె
మంతనమందు నెంచె ననుమానమికేలను చోరు లల్లనా
డంతకుఁ జేర్పకే శిశువునందలి చిహ్నముఁ జూపి రెంతయున్ ॥

చం॥ తెలిపెను పాదమందున తుదిన్ గలవ్రేలు వినష్టమయ్యె నం
చెలమి పులిందుఁ డౌర యదియే మృతచిహ్నముగాగఁ జూపి
రులు నను బొంకుఁబుచ్చి బహురూప్యములన్ బహుమానము
కలి నెటు [illegible] గాంచి సయ్యెఁ గదా ధరాస్థలిన్

చ॥ మనపనిదీరె రాజగు సుమా యను జోస్యులపల్కు శూన్యభా
జనమొనరించి నాఁడనని సంతసమందుచు నుంటిఁగాని నె
మ్మనమున నెంచనైతి నిటు మారణముం భావించి రేమొ నే
బనిచిన చారులంచు భగవంతుని చర్య విచిత్రమౌఁ గదా॥

ఉ॥ పంచతఁగాంచె బాలుఁడని భావమునందుఁ దలంచి యుంటి నే
నెంచఁగనైతి వీఁడిటుల వృద్ధినిఁగాంచి మదీయరాజ్యభా
గ్యాంచితలక్ష్మి తానగుచు హస్తనిపీడన మాచరింపఁగా
నెంచఁగ మించు నంచు నెటులీతని నిర్యాడ రూపుమాపుదున్ ॥

గీ॥ తానబల్మిగాని తనబల్మి గాదని
జనము లాడరొక్కొ చర్చసేయ
నిచట వీనిఁజంప నెంచంగ రచ్చయౌ
నేమిసేతు నింక నెటులనైతు ॥ 57

శా॥ ఈసామంతుని కన్నుగప్పుగతి నెట్లీబాలునిన్ ధర్మసం
వాసస్థానముఁ జేర్చుచెట్టు లోరు లివ్వార్తన్ విన్న బోనటుల్
గా సల్పంగల నెట్లు మద్హృదయశల్యం బెట్లు బాయున్ నిరా
యాసం బీకరణంబునన్ దగదు వెయ్యార్మార్లు యోచించినన్ ॥

ఉ॥ శ్రీపురరాజ్యలక్ష్మి కడుచేరువ నున్నది మత్కుమారు దై
ర్యాపరకాంచనాద్రి సుజనావనదక్షు గుణాంబురాశినిన్
భూపతిగా వరించు నిఁకఁ బుట్టదు విఘ్నమటంచు నెంచి నే
నోపిక బట్టియుంటి నితఁడూడె నిఁకేమని నెమ్మనంబునన్ ॥

కం॥ ఒకదాని నేనొనర్చిన
వికటంబుగఁ జేయుచుండె విక్రుతఁపు దయ్యం
బకటా! తలఁపఁ బ్రతిక్రియ
పటుమర్ఘట మెట్టియుక్తి బన్నఁగ ననువో॥

చ॥ స్వయముగ వీఁడు జచ్చెనను జాడఁ గనుంగొనకున్న నెట్టుల
య్యయొ! యిఁక తాళఁగల్గుదు వ్యథాకులపావకదాహమయ్యె
నయమున మేలుసేయఁగ మనంబున నెంచిన యాప్తు పొల్క
బ్రియములు బల్కి యిల్ వెడలు రీతిని మంత్రముబన్ని కూల్చె

కం॥ అదిగాక మరొకగతి నా
మదికిఁ స్ఫురియింపఁ బోదు; మంచిని విషముఁ
మదికింపుఁ జేయ నగు; భీ
ప్రదమౌ క్షీరములు శత్రుపద్ధతి నొసఁగఁ॥

గీ॥ సామమున దీర్చుగతి కార్యసమితి నొందు
యుక్తిసాధింపఁ జాల మీయుర్వి యందుఁ
గాన మనవా రుపాయముఖంబు నందు
నిలుపరే గురుభావంబు దెలుపునటుల॥

కం॥ ఈగతి నాలోచింపుచు
మూగవిధంబునను జెలఁగ భోజనకృతకా
లాగతచిహ్నగ నొకపరి
జేగంటలు మ్రోయుటయును సేవకులంతఁ॥

వ॥ ఓగిరము సిద్ధపఱిచితి మని విన్నవించుటయు మంత్రిమణి
స్నానాదికృత్యంబులు నిర్వర్తించి. 65

గీ॥ షడ్రసోపేతమైన భోజన మొనర్చి
శయ్యపై మేనుఁజేర్చి విస్తారవేద
నాపరవశాత్ముఁడై యేమి తోఁపఁబోక
తలఁచె నాదుష్టబుద్ధి స్వాంతంబునందు॥ 66

ఉ॥ పెక్కులు చిక్కులొక్కమొగి పిక్కటిలన్ మతి తక్క కింతయున్
బొక్కక యుక్తిఁబన్ని పరిపూర్తి యొనర్చెడి వాఁడనంచు తేఁ
డక్కజమంద నెప్పగల యట్టేఁడ; నేఁడది యేమొ దీనికిన్
దిక్కొక యింతఁ దోపదు పదింబది యోచనఁజేసి చూచినన్॥

చం॥ అని మదినెంచి సంశయసమాకులమానసుఁడై జెలంగు నా
తనిహృదయాంబుజాతమున తత్క్షణమే స్ఫురియించె నొక్క యో
చన, యటులన్ బొనర్చునెడ చచ్చియె తీరును చంద్రహాసుఁడం
చును ప్రమదాతిరేకమున జొక్కపులిందుఁడు జేరవచ్చినన్॥

చం॥ తనుగన నచ్చోటున్ గదియఁ దా జనుదెంచు పులిందుగాంచి మిం
చినకపటానురాగగతచిహ్నము లొప్పఁగఁ జేరఁబిల్చి నె
మ్మనమున నుబ్బుగల్గ గలమాటలఁబల్కియుఁ గొప్పఁజేసి యో
జనవర! త్వత్సమానగుణజాలవిభూషణు లుండ్రె ధారుణిన్॥

చం॥ సరసుఁడ వార్యసన్నుతవచఃకలితుండవు సాధుమూర్తి వా
దరపరిపూజితాతిథివదాన్యుఁడ వంచితదానధర్మవి
స్ఫురితకరాంబుజుండ వరిపుంజదరఘ్నశౌర్యధైర్యభా
స్వరుఁడవు నిన్నుఁ బోలఁగల్[illegible]॥

గీ॥ అని ముఖప్రీతివాక్యము లాడఁబొంగి
తెచ్చికోల్పునుతులంచును తెలియలేక
నాపులిందుండు సచివుని కనియె నిట్లు
కల్లమెచ్చులలోఁబడుఁ గద జగంబు॥

ఉ॥ ఎంతటివాఁడ మీవలన నిట్టినుతుల్ గొన త్వత్కృపాప్తి న
త్యంతము మించువాఁడ నిటులాడగ యోగ్యుఁడఁ గాననంగ మ
త్స్వాంతము సంతసించె విలసద్గుణ! తావకసత్ప్రవర్తనల్
కాంతములౌట నంచు ననఁగాఁదొడఁగెన్ సచివుంఁడు బ్రీతినైన్॥

చం॥ సకలకళాప్రశస్తవిలసద్గుణబాహుబలాత్తధైర్యవ
త్ప్రకటితశక్తియుక్తుఁడు గదా భవదీయసుతుండు వాని మా
మకనరపాలుకొల్వునను మన్ననలం దెడు నట్లొనర్తు సా
ఖ్యకరబుజప్రవర్తకునిఁగా నొనరింతును సుమ్ము నమ్ముమా॥

చం॥ మరచితిఁ గొన్ని పత్రములు మామకగేహమునందు, వానిఁదే
నొరులనుఁ బంపరాదు కడు యోగ్యునిఁ గాక; రహస్యకార్యముః
పరులకు వెల్లడించుఁ బెరవారలఁ బంపిన, త్వత్కుమారు వే
గిర మనుపంగ నౌను ప్రభుకృత్యము నిర్వ్యెడ నిర్వహింపఁగన్॥

గీ॥ రాజకీయంబులైన కార్యములపట్ల
ప్రాణవాయువులను తృణప్రాయముగను
తలచి తనరాజభక్తి నంతయును జూపి
యశము గనఁ దగు సమయమైనప్పు డనుచు॥

కం॥ ఏలికకంటె ధరాస్థలి
నాలును సంతతియు మఱియు నసువులు ధనధా
న్యాళియుఁ గాదందురు రా
జాలంబన మున్న స్వర్గ మరచేతదగున్॥ 76

ఉ॥ ఏనట కేఁగి వత్తునని యీవు వచించెద వేమొ జూఁడు మ
స్లైన మదీయకార్యనిచయావళి దీరుటలెట్టు లింకపై
నే నొకరుండ నొంటరిగ నిర్యోడ నెట్లువసింతుఁ గాన నీ
పూనిక మాని నీకొామరుఁబుచ్చుట యోగ్యమటంచుఁ దోచెడిన్॥

కం॥ తిరుగక చెడుదురు పురుషులు
తిరిగినఁ జెడిపోదు రెందు స్త్రీలన వినమే?
నెర వేటికి తగుగతి మ
త్పురికంపుము సూను సేమములు జెలువారున్॥ 78

కం॥ మంతిరి యిటుబల్కిన సా
మంతధరాజానిహృదయమధ్యస్థితతీ
శ్రాంతస్ఫురదీడ్యలస
త్కుంతంబులు నాటినట్లు కోలుమసఁగియున్॥ 79

మ॥ అరచేనుంచియుఁ బెంచుచుంటలును నిత్యంబున్ తృటిన్ బాయకే
పరిరక్షించుటఁ బ్రాణతుల్యముగఁ గావన్ గల్గుటల్ గాంచి యీ
దురితాత్ముం డిటు పల్కుచేలనోకొ విందుల్ మెక్కియున్ గేహమున్
పరగన్ బ్రద్విన భాతి నెట్టులను మాన్పన్ వచ్చు నీదుర్విధిన్॥

చం॥ ఇతరుల కంటఁబడ్డయెడ నెక్కడసోకునో దృష్టియంచు నా
మతిఁదలపోసి యేను మరి మత్సతి కన్నులలోనఁ బెట్టి పెం
చితి మిపుడిట్లు బంపనగు శ్రీపురిఁజేరఁగ మార్గయానసం
గతమగు కష్టమీతఁడెటుగాంచి సహింపఁగ నేర్చు నక్కటా॥

చం॥ అనిశము ప్రేమతోడఁ బువ్వులందునఁ బెట్టియుఁ బెంచికొన్న నం
దను నెటు శ్రీపురంబునకు నాతరమా బనుపంగ చంద్రహా
సుని ముఖనీరజం బిపుడు జూడక మేము తరించు టెట్లు లీ
దినదినకల్పముల్ సతియు దీనతవాసి చరించు టెట్టులో॥

కం॥ ఈవడువున నాతఁడు చిం
తావశతఁ గడుఁ గృశించి దైన్యము మీఱన్
భావమున ధైర్యమూనియుఁ
దావలికై నమాత్యముఖము తద్దయుఁగనుచున్॥ ८३

ఉ॥ బాలుఁడు పిన్నవాఁడు తలవాకిలిఁ దప్పకజూడఁ డన్యమే
జోలి యెఱుంగఁ డర్భకుఁడు సు మ్మెటులేగఁ గలాఁడు ఘోరశా
ర్దూలముఖాదివన్యమృగధూర్వహసంకులమైన మార్గమే
లీలచొరం గలాఁడు లవలీవరకుంజవృతాగసీమలన్॥

ఉ॥ ఏఁ జనివత్తుగా ముదలనిచ్చిన నంచన, నిందు నొంటినే
యోజను నిల్తునార కడుయోగ్యుఁడవే యటులైనఁ జూడు నే
నే జనలేన బాలుఁడువన్ దరియింపఁగ లేఁడె తోడుగా
తాఁ జనరాదె చిత్రముగదా భవదీయవచఃప్రపంచముల్॥

గీ॥ పీలు లేకున్న పోనిమ్ము వెఱపు లేదు
కాకికాలికిఁ గబురంపఁ గాళ్లత్రోడ
రాక తక్కునె నీకున్న రాజభక్తి
బయలు పడె సంతసించితి నిప్పటికి నిట్లు॥ 86

గీ॥ అనుచు నీర్ష్యాంతరితములైనట్టి వాక్య
తతిని మొగమెల్ల చిట్లించు స్థితిని దెలిసి
నెమ్మనంబున యందు చింతించె నిట్టు
లా పుళిందుఁడు సవ్యాకులాత్ముఁడగుచు॥ 87

గీ॥ పంపకుండిన మంత్రి యిప్పట్ల కుపితుఁ
డై ఘటించును చిక్కు లత్యంతకఠిన
చిత్తుఁ;డంపిన బాలునిఁ జెందుఁ గీడు
కత్తునాగటి మధ్య జిక్కంగఁ గల్గె॥ 88

కం॥ ఎట్టులైనఁ బంపకుండినఁ
గుటిలాత్ముఁడు కష్టతతుల గూర్చును గాన
భటులసహాయముతోన
చ్చోటునకు నాత్మజునిఁ బంపఁ జూచుటయె తగున్॥ 89

వ॥ అని తనమనోంబుజంబునం దలపోసి యమ్మంత్రివరుం
గాంచి నాతనయుని భవదాజ్ఞానుసారంబుగా శ్రీపురంబునకుఁ బంపె 90
దనని యానతి యొసంగె నంత.

## ఆశ్వాసాంతము.

చ॥ నిరుపమసద్గుణౌఘ సరణిస్స్మరణీయ, కవీంద్రగేయబం
ధురగుణభాసమాన అసమానదయారసభాసురాత్మ ని
ర్భరశరహారహీరనిభభవ్యయశఃకలనాకలాప సుం
దరతరరూప, భవ్యవసుధాసురవంశవిభూషితాశయా॥

## పంచచామరము.

భవానిశంకరాంఘ్రియుగ్మభావనప్రభావుకా
భవాభిరామగేహకల్పబద్ధ భక్తిభాసురా
అవార్యకీర్తికామినీహృదంబుజాతభాస్కరా
కవీశవంద్యమానదానకర్ణసద్యశోమయా॥

ఇది శ్రీ శేషాచలాధీశ చరణసేవాసమాసాదిత కవితా
విచిత్ర దూపాటివంశ పయఃపారావారరాకా
సుధాకర శేషాచార్యపౌత్ర వేంకట
రంగాచార్య పుత్ర శేషాచార్య
కవిమిత్ర ప్రణీతంబైన
చంద్రహాసచరిత్రమున
ద్వితీయాశ్వాసము.

# చంద్రహాస చరిత్ర.

## తృతీయాశ్వాసము.

శ్రీరఘురామాంఘ్రియుగాం
భోరుహసేవానుకూల ✱ బుద్ధివిశేషా
వారాంరాశిగభీరా
ధీరా! రఘునాథరాయ ✱ ధీమణిగేయా॥

గీ॥ అవధరింపుము సామంతుఁ ✱ డాత్మజాతు
శ్రీపురంబునకును బంపఁ ✱ జిత్తమందుఁ
దలచి మంతిరియాజ్ఞ నొం ✱ దంగఁ బంపఁ
బల్కె సచివునిఁ గాంచి య ✱ బ్బాలుఁ డపుడు॥ 2

ఉ॥ శ్రీపురికేగి రమ్మనుచుఁ జెప్పెను మజ్జనకుండు నాకుఁ దా
మేపని నిర్ణయించెదరొ యేమొ వచింపుఁడు పోయివత్తు నం
చా పసిబాలుఁ డాడ విను నట్టి జనంబుల చిత్తపద్మముల్
కోపతరంబుగాఁ జెలఁగెఁ గ్రూరుని మంతిరి పంపునెంచుచున్॥

ఉ॥ బాలుని వీపుఁదట్టుచు శుభంబగు నంచని మంత్రి బల్కుచున్
సీలును జేసియుండి పరిశీలనఁ జేయఁగ వీలుగాని ప
త్రాళినిగల్గు జాబొసఁగి యయ్య! మదీయకుమారుఁగాంచియీ
ప్రోలున నుంటి నంచుఁ గబుర్న వచియించియు లేఖనీఁదగున్॥

ఉ॥ ఎంతటికష్టమబ్బిన సహింపుమఁ గాని మదీయ లేఖ కా
సంతయు వెల్లడింపకు శుభావళిగల్గును పోయిరమ్ము మా
గ్గాంతరమందు నిల్వకు మదాత్మజుఁ గాంచెడిదన్క నంచునా
మంతిరి బల్కఁ జిత్తమని మాతసమీపముఁ జేరి మ్రొక్కెనన్॥

చం॥ ఎటు జనివత్తువో తనయ యే నినుఁ గ్రమ్మరగాంచుటెట్లొ దు
ర్ఘటవనసత్వసంకులము కాననెటుల్ దరియింతువో మనం
బటమట నందెదన్ హృదయ మాతురతన్ వహియించె పోక మా
నుట తగదెట్లొ జాగ్రత జనున్ వహియింపఁగ నెల్లవేళలన్॥

గీ॥ పోయిరమ్మని యశ్రువుల్ పొదలు కన్ను
దోయి గద్గదమగుచును త్రొట్రువడగ
నైన మెలుఁగున సెలవీయ నచొటువీడి
తండ్రిదరిఁజేరి భక్తి వందనముఁ జేసి॥

చ॥ అరగియు వత్తునయ్య తమ రాజ్ఞయొసంగిన నంచనంగ సా
దరపరిరంభణంబున నె దర్గ గదియించి కుమార పోయిర
మ్మరిగెడి పట్ల జాగ్రత శుభావళిన్ వరియించు సౌఖ్యసు
స్థిరతఁ జెలంగు నంచును వచించెఁ బుళిందుఁడు నిబ్బరంబుగన్॥

ఉ॥ సర్వవిధంబులన్ పృథుల సత్వముగల్గి సలక్ష్యలక్షణా
ఖర్వమునై ప్రభంజనని కారనిరంతరవేగగామి గాం
ధర్వముఁ దెచ్చి సాహిణి ముదంబున చెంతల నిల్పె నంత నా
పార్వణచంద్రబింబసమ భవ్యముఖుండగు చంద్రహాసుఁడున్॥

సీ॥ నలిపెంపు పట్టుదువ్వలువ చుంగులు వార
పరగ మూపున నల్లెవా టొనర్చి
స్ఫటికంపు కర్ణభూషణగోచి ప్రచురించు
ఘనకిరీటంబు మాళిని ధరించి
అనవద్య తేజోవిహారంబు నలరించి
మెరయుచుండెడి బాహుపుహలఁదాల్చి
ఇరువైపులను వాడి బరగి దగద్ధగల్
చిందు ఖడ్గం బొండు చేతనూని
వెలుఁగు వేణుజ మౌక్తిక విసరహార
సంతతిని బెంపుమీర వక్షమునఁదాల్చి
తనదు చెలువంబు నిలువుట ద్దమునఁ జూచి
సొగసుదీపింపఁ బయనంపు జూపుగదుర॥

సీ॥ తననవ్యహాసంబు ననుకరించెడు నట్టి
చలువజిలుంగుదు వ్వాలువగట్టి
తనమోము కాంతుల కెనయనఁగాఁ జాలు
చంద్రహాసము గేల చాలఁబూని
తనమేని తళతళల్ దనరిమించెడు భూష
ణములు హారములు కం ఠమున నూని
తనయంగసుకుమార తను వెల్లడించెడు
మిసిమిచెన్నెసఁగు కు ప్పసముఁ దాల్చి

గీ॥ తన సుకీర్తి విభాతతి ననువుఁపఱచు
కాశవాగీశకార్ద్రివే యేశహీర
కాంతిజితపారశీకకం ఖాణమెక్కి
చంద్రహాసుఁడు శ్రీపురి చక్కికేగ ॥

సీ॥ చంద్రహాసములీల చంద్రహాసముచాల
కరపార్శ్వమున మించి గ్రాలుచుండ
విబుధేశ్వరులలీల విబుధేశ్వరులు చాల
నందంద గుమిగూడి యలరుచుండ
అనిమిషాక్షులలీల ననిమిషాక్షులు చాల
నుపవీథుల నిల్చి యొప్పుచుండ
తార్క్ష్యసన్నిభలీల తార్క్ష్యసన్నిభి చాల
జవసత్త్వములతోడఁ జాలియుండ

సద్గుణంబులలీలఁ బ్రశస్తులైన
సద్గుణంబులు చాల చక్కటఁ జెలంగ
వరలెఁ బార్వణచంద్రబింబంబుభాతి
చంద్రహాసుండు పయనంబు సాగి యపుడు॥ 12

చం॥ చనుచును మార్గమధ్యమునఁ జండతరాటవిఁ గాంచి దాన న
త్యనుపమఘోరసత్త్వవిపులార్భటులన్ వినుచున్ సమీపధా
రుణిరుహముల్ లతాతతులు ప్రోజ్వలనాకువులున్ నికుంజముల్
గనుఁగొని సంతసింపుచు జగ్గాభమనోంచుచు నేగియంతటన్॥

గీ॥ వనిని దరియించి తలచె నెమ్మనమునందు
నడవిఁ జొచ్చిన దాది నాహారనిద్ర
లెందుఁ జాలక కృశియించి రెంతయేని
పరిజనంబులు నిల్వఁగాఁ బంపుటొప్పు॥

కం॥ శ్రీపుగవర మిచ్చటికి స
మీపము నందుండనోపు మిక్కిలి కృశులై
యోపిక దక్కిరి పరిజన
మీపట్టున విడియఁజేసి రేఁ జనివత్తున్॥ 15

గీ॥ అస్మదాగమనంబున కరయుచిచట
నుండ భటులకుఁ బల్కి యినుండు పశ్చి
మాంబుధిన్ గ్రుంకుటలు తన యాత్మనెంచి
నిలచె నారాత్రి వారితోఁ గలసియచట॥

గీ॥ గగననాటకమందునఁ గంజమిత్ర
పాత్ర రానున్నదని తెల్ప వచ్చినట్టి
సూత్రధారు విధంబునఁ జూడనయ్యె
విమలమగు కాంతులకు నిక్క వేగుఁజుక్క ॥ 17

మ॥ తరుణీచూచుకలిప్తచందనసుగం ధంబుల్ కరమ్మూని భా
సురపంకేరుహషండకుట్మలములన్ సొంపార వర్తించి యా
దర మొప్పారఁగ మించు దంపతులమ ధ్యన్ జేరి హర్షించి మ
దరయానంబుల వాతపోతములు చెం దన్ సాగె నిమ్మాగతిన్

ఉ॥ చామలతోఁ బెనంగి సుఖ సంపదనందిన ప్రోడలార! యా
రామము నందుఁజేరి నిదు రన్ గనుఁగూర్కెడి పాంథులార! యు
ద్దామతఁ బూర్వపాఠఁపుశ తంబు పఠించు కలార్థులార! బ
ల్గోమున నిద్రలెండనుచుఁ గొక్కురొ కోయని కూసె కోళ్లొగిన్

చం॥ ఎలమి నిశాటు తేజమును హీనముఁ జేసి తమంబడంచి త
మ్ములకుఁ బ్రమోదమిచ్చి రుచి పుంజము లష్టదిగంతరంబులన్
జెలువలరారఁ జేసి కరు ణించు నినోదయమా నటంచుఁ గ్రే
వల నినదచ్ఛలాప్తి ద్విజ పాళి యొనర్చెను భావిసూచనల్ ॥

గీ॥ ప్రాగ్దిశాఘనభూషణ ప్రాంశురుచియొ
కుక్షిసంస్థితభాస్కరు గురు మహాంబొ
వ్యోమసురసాలపల్లవ పుంజకళయొ
గాఁదగు ననంగ నుదయరా గంబు వెలిఁగె ॥ 21

గీ॥ పగలు కల్పింప నేర్పరి - పంకజాత
హితుఁడు మలినాళిరతుఁడు స - మ్మతుఁడు వీని
మొగము రాజావలంబనం - బుగను మేము
కాంతుమే? యని ముకుళించెఁ - గలువచాలు॥ 22

చం॥ మొదటను వెన్నెలల్ దునిమి - పోవఁగ నున్న వెడంగు చీఁకటిన్
జెదరఁగఁ జేసి కల్వలను - చేడెలకాంతి దొరంగఁ ద్రోచి యొ
ప్పిదమగు పాటలచ్ఛవి న - వేలగతిన్ దిశలందు నిల్పి యుర్విన్
పిదపఁ బయోరుహాప్తుఁడు జ - నించెను ప్రాగ్ధరణీధరంబునన్॥

సీ॥ కలకదేరిన నీటి - కాల్వల నన్నింటి
జాహ్నవీనిభకాంతి - చయినొసంగ
క్రొంజివురాకుల - మంజులచ్ఛాయల
జక్కనిరీతిని - సంస్కరించెఁ
దలవ్రాల్చి జాలితోఁ - దాల్మివీడిన తమ్మి
పూచేడియల కెన్నొ - ముద్దులొసఁగ
గండుతుమ్మెదల వె - క్కసఁపు నిర్బంధంబుఁ
బోఁగొట్టి మిగుల స - మ్మోదమిచ్చె
విన్ను ముట్టితినంచు నా - శ్వేరమూని
తగు నిశాటుని కళల సాం - తము విదల్చి
నుదయ మందిన పిదప న - త్యుచ్ఛ్రయముగ
ధరణి కేతెంచు భాస్కరు - కిరణరాజి॥ 42

మ॥ ఇఁకముం దిట్టుల త్వాత్వ్రిభావములు లో కేశ్యంబులో విద్విష
త్ప్రకరానేకమహాంధకారములు దూ రంబయ్యెడిఁ బద్మినీ
నికరంబుల్ కడుసంతసించునని వీ నిఁ సామ్యముఁ జేసెనా
యకలంకప్రభ మీఱె పూర్వకుధర ప్రాంతంబునం దెంతయుఁ

గీ॥ కాల్యకృత్యంబులెల్లను గడపి యంత
స్నానమాడి భుజించి య నంతరంబు
రమ్యకళ్యాణపల్యాణ రాజితాశ్వ
మెలమి సాహిణి గొనివచ్చి నిలుపనెక్కి॥

చం॥ మరచితినేమొ యంచును న మాత్యుఁడొసంగినజాబుజేబుఁ
దరసియు సేవకుం డొసఁగి నట్టి సభక్ష్యవిశేషముల్ మహా
దరమునఁ జేతఁ బుచ్చికొని తానొక సన్న యొనర్చినంత నా
హరి పవనాతివేగమున నచ్చొటు వీడి గమించె నెంతయుఁ

చం॥ చనిచని భాస్కరుండు కర జాలవిభావిశిఖాళి పాంథవే
దనమును గూర్చుచుఁ గగన ధామముమధ్య వెలుంగ నాళిసీ
బునఁ గృశియించుచుఁ జనుచు ముందుగనుంగొనెపుష్పవాటి
జనపదబాహ్యభూమి పెలు చఁ దనయానభరంబు రూపజా

కం॥ అందందుఁ గానఁబడు జన
బృందము పృచ్ఛించి దాని శ్రీపురియని యా
నందమున గ్రహించి వనా
నందము పొడగాంచి తాఁ జ నం గలవాఁడై ॥

సీ॥ తియ్యమామిడి జేరి తిన్నని నుడుల చేఁ
బాంధులఁ గలచెడి పరభృతములు
ఇప్పపూఁదేనియ నింపుమై సాపడి
మత్తునబాడెడి మధుకరములు
కానసంతట నల్ల గల్వతోరణములు
గట్టు జూపుల కురం గములగములు
చీఁకటిచెట్టుల చెంతవసించి పిం
చియము విప్పి నటించు శిఖికులంబు
ఫలమహీరుహములపయి బారుదీరి
పల్కుచుండెడి గండుచి ల్కల చయంబు
హృదయమున కబ్బురము గూర్చి యెసఁగుచున్న
నవ్వనంబునఁ జొచ్చి య నంతరంబు॥ 30

సీ॥ శారికాకలకంఠ కీరస్థితశిఖాగ్ర
రాజితసురసాల భూజములును
మధుపానవిగతబం భరకులఝంకార
రంజితవల్లీని కుంజములును
పరిఫుల్లసూనసం బంధమందాగత
ప్రచలితదక్షిణ వాయువులును
రాజహంసక్రౌంచ రాజదంభోజసం
తానభూషితజలా ధారములును

గలయఁ గనుఁగొని సంతోష కలితుఁడగుచుఁ
దద్వనవిలాసమునకుఁ జి త్తంబు నంపు
నలరి మార్గశ్రమాపన యాభిలాష
నందు నిలువంగఁ దనయాత్మ యందు నెంచి॥

కం॥ తన దేహగ్లానికి వా
డిన పూదీవియు చెలువున డీవి దొలఁగి చి
క్కిన మేను నూర్పులొప్పఁగఁ
గనలి ముఖంబునను చెమట గ్రమ్మఁగనంతన్ ॥

చం॥ తురఁగముఁ బచ్చికల్ గలుగు స్రోవలలో విడియించి వారి
కరమునఁ దానమాడియును కమ్మనిభక్ష్యములన్ భుజించి త
త్పరిసరసల్లతాగృహము ధామమునాఁ జెలువారఁజొచ్చి య
దరయఁగనైన వేదిక శ్రమాపనయార్థము బవ్వళింపఁగన్॥

గీ॥ ఆతపాయాసమున స్రుక్కి నందువలన
నిదుర యావేశమయ్యె వా నికి నొకింత
అవనిశయ్యాసుఖములు ని ద్రాతురునకు
నవసరంబెందు లేదు గ దా తలంప ॥

వ॥ అట్లు చంద్రహాసుం డత్యంతనిద్రావేశుఁడై సుఖని
ద్రజెందు నవసరంబున

ఉ॥ మంతిరి దుష్టబుద్ధికి కు § మారుఁ డొకండు సుమాంచితాంగి య
త్యంతసురూపవైభవ జి § తాత్మజురాణి వినీలనీరదా
క్రాంతసువేణి నుత్తగజ § రాజసమాలసయాన పూర్ణిమా
కాంతమనోహరాననయు § గల్గునొకర్తు కుమారి యొంతయున్ ॥

ఉ॥ బాల్యమువీడి యౌవన వి § భాపరిఫుల్లతరాంగవల్లియై
శాల్యవిశాలనేత్రయుగ § లాలితయై మరుచేతనొప్పు నా
శల్యము భాతి నెప్పుచు ప్ర § శస్తతరాంగవిభాసమానయై
నైల్యశిరోజయై విషయ § నాఁ జను నాఖ్యవహించి ధారుణిన్ ॥

క॥ చూపులు మదనునిములుకుల
నాపు శిరోజములు బంభ § రౌఘంబులఁ దా
మాపును గళమో శంఖము
నాపును చంచలల తనువు § నందలి కాంతుల్ ॥ 38

మ॥ కనుపట్టెన్ ప్రసవాస్త్రబాణముల వీ § కన్ జూపు లబ్జాతప
త్రనితాంతస్థితి కన్నుదోయి చెలఁగెన్ § తారామనోనాథపా
వనబింబంబన నాస్యమొప్పె సుమవ § ల్లీమతల్లీగతిన్
తను వొప్పారె మృణాళనాళగతి విం § తన్ హస్తముల్ భాసిలెన్ ॥

సీ॥ సహజతైక్ష్ణ్యంబులై § చాంచల్యయుతములై
తూపులో యన నొప్పె § చూపులంత
సౌందర్యకరములై § సంతోషభరములై
సరసములై [illegible] § [illegible]

కాంతివిధానమై ॥ కళలనిధానమై
మంగళకరమయ్యె ॥ నంగమంత
హాసప్రచారమై ॥ భాసప్రసారమౌ
సదనమై యలరారె ॥ వదనమంత
సూక్ష్మమై మరి సూక్ష్మాతి ॥ సూక్ష్మమగుచు
తథ్యముగఁ గాంచఁ దనరారె ॥ మధ్యమంత
నాఁడు మోహినివైన న ॥ న్నలిననేత్రు
సోయగము మాటికెంచఁగా ॥ నాయెనంత ॥

సీ॥ అతిచంచలములు ని ॥ సితతీక్ష్ణతరములై
యేపుమీరెను. కాంత ॥ చూపులంత
కాంతివంతంబై ల ॥ తాంతపేశలమౌచుఁ
దేజరిల్లెను కన్య ॥ దేహమంత
జానుదీర్ఘంబునై ॥ సన్నీలకళనొప్పి
వెలసె।నాకన్నియ ॥ వేణియంత
జవజవలాడుచు ॥ మివులసన్నంబౌచు
మరియొప్పె నాకన్య ॥ మధ్యమంత
పూర్ణిమాసోము దెగడుచు ॥ మోముదనరె
తూడులన హస్తయుగ్మంబు ॥ జూడనొప్పె
కర్ణదీర్ఘత్వమున కన్నుఁ ॥ గవ రహించె
యౌవనంబున [illegible] ॥ [illegible]

సీ॥ అరవిచ్చు దాడిమీ | వీరి నెల్లిదంబాడి
కరమొప్పె కామిని | కావిమోవి
మల్లెపూవులగుత్తి | నుల్లసంబును సల్పి
నెలసె చందనగంధి | మొలకనవ్వు
నెలవంక వంకలు | తొలగించి నిద్దమై
తద్దనెప్పెను చెలి | ముద్దుమోము
అమృత మాధుర్యంబు | నవఘళింపఁగఁజాలి
యలరారె లోలాక్షి | పలుకుచాలు

జలజసంతతి నెంతయు | జడమొనర్చి
నెలత కరపాదతలములు | నివ్వటిల్లె
కొలిచి నట్టుల యవయవం | బులు జెలంగె 42
సృష్టివైచిత్రి వర్ణన | చేయగలమె॥
గీ॥ చిత్రకారుఁడు నేర్పు ప్ర | సిద్ధిచేయఁ
దలచి చిత్రించినట్టి చి | త్రంబనంగ
బ్రహ్మ తనసృష్టిసామర్థ్య | పటిమఁజూడ 43
సృష్టిఁజేసె ననంగ నా | చెలియ వెలయు॥
చం॥ తన చెలికత్తె గూడియు స | దా జనుదెంచెడి పోల్కి సమ్మదం
బున జరియింపఁగా నుబుసు | పోకకు గా నటునాఁడు గూడ త
ద్వనమున సంచరింపఁ దన | ధామము వీడియు మంత్రిపుత్రి నూ
44 తనప్రసవాస్తృతిక్రమన | దా జనుదెంచె విలాసవాసయై॥

సీ॥ పాదస్వనద్ధేమ ♦ వలయముల్ మునుముందు
మంజీరరవముతో ♦ మాటలాడ
కమసొగగల్గి న ♦ కుక్కడు సోయగముగల
కనులు శ్రోత్రముల స ♦ ఖ్యంబు సల్ప
గందంపు మైపూత ♦ కరణి గుత్తపురైక
యంగక ప్రభకు ని ♦ య్యాంబు నాప
కాంతివంతంబైన ♦ కర్ణభూషణరోచి
తారహారములతో ♦ దారసింప
మలయమారుతపూరిత ♦ కలితగంధ
బంధురంబుల కెదమోద ♦ భరితయగుచు
తనదు నెచ్చెలిఁగూడి ము ♦ దంబుగదుర
వనినిఁ జేరంగనై తగు ♦ వాంఛ జెలఁగ ॥ 45

చం॥ సకికయిదండనూని తన ♦ స్థానము వీఁకటలాది త్రోవతో
ప్రకటితమై చెలంగెడి శు ♦ భంకర చిహ్నములెల్లఁ గాంచి చి
త్తకమల మంచితస్థితి ము ♦ దంబు వహింపఁగ మందయానయై
చెక చెకఁ జేరవచ్చె వన ♦ సీమకు తద్విభవంబుఁ గాంచఁగన్ ॥

గీ॥ కల్గు శుభసూచకములను ♦ గాంచి సఖియ
బలుకు నెచ్చెలి నేఁడు ని ♦ న్నలరఁజేయు
రాకుమారుఁడు గల వన ♦ ప్రాంతమునను
నేఁడసంగను తలవంచె ♦ నెలతయంత ॥ 47

ఉ॥ కొమ్మరొ పల్లవాగతము కొమ్మలు గోరెడు శ్యామగోరెఁ జూ
సమ్మతి నెంతయుఁ విటప సంగతముఁ కలకంఠకంఠి నీ
నెమ్మది రాకుమారుని వ నిఁ జరియింపఁగ నేఁడు గాంతుసౌ
ఖ్యమ్మగునట్టి యోగము గాంచఁగఁ గల్గుట చేత నెచ్చెలీ॥

కం॥ అని చెలికత్తియ పల్కిన
విని వననట్లాకె వినవె విశ్రుతమంద్ర
స్వనమున పుంస్కోకిలకొ
మ్మను దరిసియు వెలసెఁ గనుమ మదగజగమనా॥ 49

కం॥ అగునగు పుంస్కోకిలచె
న్నగుకొమ్మల నెపుడు గూడు టది యర్హంబే
తెగువగను మీ మదాళులు
మగువా మధుపానవశత మలసెడిగంటే॥ 50

సీ॥ వెలదిరో గాంచితే విరియఁ బారిన మల్లె
మొల్లతీవియల స త్పుష్పచయము
కాంతరో గనుగొంటె కొంతలతాళిసం
గతమాచు వెలసెడి కళికలగమి
చామరో గంటె ర సాలశాఖాగ్రసం
కలితారుణంబుల తలిరుచాలు
సకియరో గంటె కో రకితపుష్పితపల్ల
వితభూషితానేక విధకుజనులు

లఁనరో కనుఁగొంటివే కలరవైక
శారికాకీరకలకంఠ సమితి గాన
మధికసంతోషదాయక మై చెలంగ
నేఁడు వనవాటి ప్రీతిమైఁ జూడఁజూడ ॥ ౫౧

ఉ॥ అన్నులమిన్న కన్నులకు నందము బొందుపడన్ దనర్చె ను
త్పన్నమహోన్నతోన్నతము దంబుహృదంబుజమున్ దలిర్చఁగా
క్రొన్ననలెన్న చెన్నొదవు కుందములొందెడి యందచందముల్
మొన్నఁగ నిన్నగప్రతతి యింపుఘటించి వనిన్ జెలంగెడిన్ ॥

కం॥ అని యిటు వనసౌందర్యము
గనుఁగొనుచు విలాసవాక్య కలితానందం
బినుమడి యగుటను చెలివిడి
జనుచుండె లతావిచిత్ర సాలోకాప్తిన్. ౫౩

ఉ॥ నెచ్చెలి వీడియున్ విషయ నెమ్మదికిన్ బ్రమదంబుగూర్చుచున్
అచ్చెరువైన సూననిచ యాభిసుశోభితసల్లతానికుం
జోచ్ఛదశన్ గనుంగొనుచు నొక్కకుడుంగమునందుఁగాంచెఁదా
బచ్చనివింటివాని పరు వంబున నిద్దురజెందు యావనున్ ॥

చం॥ కనుఁగొని రిచ్చపాటొదవ గావెనుముందుఁ జనంగలేక నూ
తనకుసుమాస్త్రుఁడో యనెడు తత్పురుషోత్తము రెప్ప వేయకే
గనుచును దత్తరంబొదవ గాముఖనీరజమెల్ల చెమ్మటన్
దనర నొకింత నిల్చియును దన్ దలపోయ దొడంగె నిట్టులన్ ।

ఉ॥ చక్కనివాఁడు మేల్గులుకు చాతురి గల్గినవాఁడు మోమునన్
జక్కలతేని నాపఁగల సోయగమున్ గలవాఁడయారె య
మ్మక్క! యనంగనొప్పు కమ లాంబకముల్ గలవాఁడు నిద్దురన్
జొక్కెడి నీనికుంజమునఁ జూడఁగ మన్మథమోహనాంగుఁడై॥

గీ॥ అంటగందెడి మైదీగ యట్టిగోల
గీటగా పాలుగారు చె క్కిళులు చంద
మామ గోమును నోము నె మ్మోముగలిగి
యాపరమన్మథుఁడో యన నలరెనార॥

సీ॥ పరిఫుల్లపంకేజ పత్రంబులను గేరి
వెలయుచున్నవి వీనికనులు
పూర్ణసుధాకరు పొంకమ్ము హసియించి
వెలయుచున్నది వీనిమోము
శ్రీకారములతీరు చిందరనొనరించి
వెలయుచున్నవి వీనిచెవులు
ప్రతిసుమమకరంద భాగ్యంబు గొనునట్టి
భృంగంబు లననొప్పు వీనికురులు

గీ॥ కలువలకు మోదమిచ్చి పం కజశతముల
బూని హసియించు చంద్రిక వీనినగవు
నిఖలజీవనహననని ర్నిద్రసింహ
జానిఫక్కి నెన్నారు వీనినడుము॥

మ॥ వనసౌందర్యముఁ జూడఁగోరి తన భా - వంబెల్ల సంతోషభా
జనమై యొప్పఁగ సంచరించి శ్రమమిం - చన్ నిద్దురన్ జెందన్
ఘనసౌందర్యకరాంగుఁ డెవ్వఁడొకో రా - గా కారణం బేమొకో
ననునానందపయోధిముంచెఁగద సౌం - దర్యాంగ సౌభాగ్యముల్

చం॥ అలకలు నెమ్మొగంబున వి - హారముఁ జేసెడి నీరజంబునం
దలికులమట్లు శ్రోత్రముల - నాస్తతఁ జేరిన యట్టులొప్పె క
న్నులుకుసుమాస్త్రుధర్మములు - నొక్కుసుమీబొమదోయిబింబ
త్ఫలమగు మోవి యందముల - తానజుఁ డెట్టుల సృష్టిఁ జేసెనో

సీ॥ మన్మథుఁ డగుసాటి - మనుజసింహుని కన్న
నతనుత్వ మొప్పియు - నలరు నతఁడు
మధుఁడు తుల్యుండు కు - మారునకనుకొన్న
కాలానుసారియై - క్రాలు నతఁడు
విధుఁడు సామ్యుఁడు పర - వీరునకనుకొన్న
పక్షపాతంబునఁ - బ్రబలు నతఁడు
ఇంద్రజుండు సమానుఁ - డితనికి ననుకొన్న
ననిమిషాక్షుండగు - నట్టిఁ డతఁడు
దివ్యదేహాభిశోభితు - నవ్యహాస
వికసితానను నాజాను - విపులవక్షు
రాజలక్ష్మణలక్షితు - నోజనేరు
పోల్చి వర్ణింప గలవారు - పుడమి యందు॥

కం॥ అని లక్షించుచు నివ్విధి
మనమున నెంచుచును నిద్ర మైమరచిన తె
న్నును గని పరిసరమునకును
జనుదెంచి తలంప సాగె సంతోషమునన్॥

మ॥ పదియార్వన్నె పసిండి సౌరు తనుసం పన్నత్వ మయ్యారె శ్రీ
ప్రదమై షోడశసత్కళాకలితచం ద్రస్ఫూర్తి వారింపనౌ
వదనాభల్ జెలువారు నీని పతిగా భావింప నేకాంత భా
గ్యదశావల్లి ఫలించెనోయదియె ధ న్యత్వంబుఁ గాంచన్ గదా॥

మ॥ అమృతస్యంది వచఃపరంపరలు ని త్యంబున్ వినన్ గల్గునే
భ్రమరాలోకకృతార్థ నిశ్చయము నే తద్భవ్యసౌమానసున్
ప్రమదంబొప్పనహర్నిశంబులుగనన్ భాగ్యంబు నాకోటి జ
న్మము చెందన్ గలదే రమాధవుఁడు ప్రే మన్ గూర్చునే వీనితోన్॥

ఉ॥ అంతటి భాగ్యమబ్బిన వి యత్పథమంటి చెలంగునట్టి యా
సంతసమందనే పొరుగు చామల నందఱ మించకుందునే
యంతటి కోర్కెఁగోరుటది యందని మ్రానిఫలంబు లాసనై
దృంతు నటంచు హస్తయుగి తోరపు వేడుక నెత్తినట్టులౌ॥

చం॥ హరియనుచిత్రకారుఁడు మ హాద్భుతమౌ తన నేర్పుఁజూప సుం
దరతను దీర్చితీర్చి మరి ప్రాసునఁదూచి సృజింపఁబోలు నం
చరయఁగ నవ్యో నీయవయ వంబుల సౌష్టవ మిట్టిమూర్తి ను
శ్వర వినఁబోఁడు [illegible] గాంచరు నిశ్చయంబుగన్॥66

చం॥ అదనిది యంచునెంచి కుసు / మాస్త్రుఁడు సానను బెట్టినూరితా
పొది నమరించి యుంచినయ / మోఘశితాస్త్రములొక్క పెట్టునన్
మదవతి చిత్తవీధినిస / మంబుగఁదాఁగురినెట్టి యేసె నె
మ్మది విజయాభిలాషనటు / మాటున జేరియు పొంచిమించుచున్

గీ॥ పరవశస్వాంతయై వాని / భవ్యదేహ
సౌకుమార్యత గనఁగ నా / చ్ఛాదనంబు
జేసె కవచంబు గానిచో / చెన్నుఁగన్ను
లార గనకుందునే యంచు / దేకిచూచి॥ 68

గీ॥ కోర్కె దీరంగ నెవ్వరీ / కోమలాంగు
విపులవక్షఃప్రదేశంబు / పేర్మిమీర
నిలుచు నాకాంత ధన్య యా / లలనదైన
భాగ్యమే భాగ్యమగును త / పంబు తపము॥ 69

చం॥ అని యిటులెంచుచున్ హృదయ / మందలికోరిక లెల్లమీరి తా
మనము నతిక్రమించె నన / మాటికి మాటికిగో మహర్ణణా
బను మిష నెప్పుచుండగను / నాతని జేబునుండి జారె పై
ననువగు శీలుగల్గి జెలు / వారెడి లేఖయొకండు ప్రేల్మిడిన్॥ 70

కం॥ జారిన లేఖను గనుఁగొనుఁ
గోరిక లీరికలు సాగ / గొబ్బున దానిన్
జేరి పఠించెను సోదరు
పేరన్ రాజసుత / విస్మయము మానగన్॥ 71

కం॥ నాలుగు మూలల జనకుని
శీలుర్ జెలువారుచుంటఁ § జింతించెను కా
బోలును మజ్జనకుఁడీ
బాలునిమాయన్న కడకుఁ § బంపిమె యుందుర్॥ 72

చం॥ జనకుఁడు జాబు నీతనికొ § సంగియు నన్నకుఁ బంపఁబోలు మొ
న్ననె గదవేగ నిల్వెడచు § నాథుని పంపున నింతలోనె నీ
తని నిటుబంపుటేలనొ గ § తంబది యేమొ పరాపకారి మ
జ్జనకుఁడు వీనిపట్ల దల § చంగనుబోఁడు గదా మెదేనియుర్॥ 73

కం॥ అగుఁగాక లేఖ నంపఁగఁ
దగుకారణ మేమొ విప్పి § దనుగా కనుచుర్
తగునిది తగదిది యని యెం
చగ బోకు లతాంగు లెందు § సాహసులు గదా॥ 74

చం॥ మరల యథాప్రకార మను § మానము లేకయొసంగనైన యా
తెరఁగున సీలు జాగ్రతఁగ § దీసియు నంచలి జాబు విప్పి దా
నరయదొడంగి నంతహృద § యాబ్జము వ్యాకులమయ్యెనంగముల్
కరము వడంక జొచ్చెనుజ § గాభ్రమగగ్గెను చూడఁ జూడఁగర్॥

కం॥ ఆమూలాగ్రము లేఖను
వేమరుదిలకించి దాన § విశ్రుతమగునా
భీమవ్యాహారంబుల
యామగువపఠించె నిట్టు § లాత్మగతముగర్

చం॥ విషము నొసంగు మీతనికి వేగమె వేరుదలంపఁబోకు సా
హస మనియెంచఁబోకుము శు భావళిగల్గును దీనఁ దండ్రి లే
డసదృశ కార్యమియ్యది య టంచు దలంపక పిత్రువాక్య మీ
దెస కడునేర్పుఁజూపు మది తృప్తిని గూర్చును జూ కుమారకా

గీ॥ సాధ్యమైనంత శీఘ్రమే జరిపియట్టి
వార్త నాకంపి సంతోష వార్ధి నోల
లాడనొనరింపు మిది కాదు కూడదంచు
మానకెట్లైన నొనరింపు మాకుమార॥ 76

చం॥ అని పఠియించి యెంచెనిటు లౌరవిషంబు నొసంగు మీనికం
చని లిఖియింప చేతులెటు లాడెనొ యీ నవమోహనాంగునిన్
గనుఁగొను నెల్లవారలకు గల్గెడుఁ బ్రేమము దుష్టబుద్ధి నాఁ
జను తనయాఖ్య సార్థకము సల్పఁగఁబోలును దండ్రిక్రూరుఁడై

ఉ॥ ఈకమనీయమూర్తి మన మెల్లహరించెను పేక్షఁజేయనీ
లేకను గాంచి భ్రాత యవ లీలగ పిత్రుహృదీప్సితంబునన్
జేకొని చేయుఁడే యెటుల జేయఁగఁ దోషము వీనిఁగాచుటా
హా! కడు చిత్రమిద్ది హృద యంబ పరాకు వహింపఁ బోకుమా

చం॥ పరపురుషప్రశంస విన భావము గొల్పని నాకు నీవనాం
తరమున సుందరాంగుఁడిటు గన్పడు వేళను గన్పడంగనే
సరసకుఁజేరి చిత్తజల జంబున మెచ్చియుఁ గోరువేళ నా
దరతను లేఖగాంచియు ము దంబు నశింపఁ గృశించు వేళనో

ఉ॥ సంతస మొక్కకంటను వి చారము వేరొకకంట నా రమా
కాంతుఁడు గూర్చుఁ జిత్రము జ గంబున ధీరులు సంతసంబునం
దెంతయుఁ బొంగఁబోరు కృశి యింపరు దుఃఖముపట్ల ధైర్య మ
త్యంతము బూనుచుందురు గ దా ధరణీతలమందు నెల్లెడన్॥

గీ॥ గాన ధైర్యంబుఁ దొలఁగి స్రు క్కంగ నేల
నేయుపాయాంతరముఁ బన్ని యేని వీని
ప్రాణరక్షణ మొనరించి ప్రాణనాథు
గాక బడయుట దగు నేర్పు కలిమి బలిమి॥

చం॥ అలసి సుఖాప్తి సుప్తుఁడయి నట్టికతంబున వీని లేపఁగా
గొలుపదు చిత్తపద్మ మను గున్ జెలి నగనవచ్చు నేమొ నె
చ్చెలి గసరాదు వీనినని చిత్తము నందు దలంచి యాపదల్
దొలఁగు నుపాయ మేదియని త్రొట్రుపడంగఁ దొడంగె చేడెయున్॥

కం॥ ఇటు లాలోచింపుచు ను
త్కట వేదనఁ గనుచు జాబు గనుగొను నంతన్
తటుకున యుక్తి స్ఫురించిన
నటునిటుఁ దిలకించి వికసి తానన యగుచున్॥

గీ॥ విషము నొసఁగుము తప్పక వీనికనుచు
వ్రాసెగద జనకుండు మ ద్భ్రాతకిందు
విషయ నొసఁగుము తప్పక వీనికనుచు
దిద్దు దానను కోరికల్ దీరునటుల॥

ఉ॥ ఏనటు దిద్దితేని యిటు లేటికి వ్రాసెనో తం్రడియంచు సుం
తేనిఁ దలంపఁడేలనన నిట్టులొనర్పుము సంతసించు మ
న్మానస మంచు నిందు నను మానము లేక యొనర్చునట్టులా
పూనిక వ్రాసియుంటజరు పుర్ దలఁపూను సహోదరుండాగి

చం॥ అరమరయేల నింకతఁణ మాగఁగ రాదు కృపర్ దలంచి యీ
నరునకు సాయమున్ సలిపి నర్ సుకృతంబగుఁగాన వే హిత
స్ఫురణ రచించి లేఖనిట పూర్వపురీతిని నుంచి పైని నే
నరిగెద నెచ్చెలిర్ గనఁగ నయ్యెఁగదా తడవిందు నిల్చుటర్॥

చం॥ అతిసుకుమారుఁడీతఁడిటు లాపదనొందక యుంట గాక నా
మతి దలపోసి నట్టులను మంగళమబ్బు నటంచు నెంచి దు
ర్గతి గనకుండ నిప్పటికి గావఁగఁగల్గితి ధన్యనైతి నం
చతికుతుకాంతరంగ యయి యవ్విధి జేయఁగఁ బూనియంతటర్

వ॥ కమ్మవిప్పి దానర్ గలుగు విషమనువాక్యంబు విషయగా నేత్ర
కమలంబులం దలరారు కజ్జలంబునర్ దిద్దిగ్రహింప వీలుగాకుం
నట్లుండుటకు నాత్మగతంబునం దలరి యథాప్రకారంబుగా నను
మానింప నలవిగా నట్లమరించి తద్రాజకుమారు హృదయ పీ
నుంచి.

మ॥ చనఁగా నెంచియు మీనకేతనధను ర్జ్యాముక్తనారాచ బా
లనితాంతవ్యధచే గృశించుచు గుణా లంకారుఁడౌ వీని ద
ర్శన మెప్పట్టునొ నింక పెనని విచా ర క్తిన్న చేతస్క యె
చనఁగాఁ జాలక నిల్వనేరక మనో జవ్యగ్రదైన్యంబునర్॥

సీ॥ కనులర విప్పి మొ గంబు చెల్వీక్షించి
చిత్తంబునందున సిగ్గునందు
నిట్టూర్పులను బల్మి నిగిడించి పాపిష్టి
దైవమా యనుచు మోదంబుడించు
బొటనవ్రేల్ నేలపై మోటించి వ్రాయుచు
ధ్యాననైశ్చల్యంబు నూనసాగు
యెద్దియో చెప్ప నట్లించుక యోజించి
తనలోన తామెచ్చి కొనగడంగు
కెరలి నాసాగ్రదృష్టినిఁ గీలుకొల్పి
జారుపయ్యంట నెరుఁగక జాలినందు
కాలగతి మారునట్టుల గ్గరిత తీరు
మారె సకలంబును నిమేష మాత్రముననుఁ॥ 92

గీ॥ జంటగానుండి మెలఁగియు సంజకావి
గల్లుగఁ బాసిన పెంటిజ క్కవ విధాన
నినుని వీడిన పద్మినీ వనితమాడ్కి
రాకుమారుని విడిచి యా రామజనుచు॥ 93

కం॥ తనుఁగన వెదకుచు నెదురుగఁ
జనుదెంచెడి చెలినిఁ జేగ సఖియా తడవ
య్యెను గద నన్విడిచియు నెం
దుననుంటివి యింతదనుక తోయరుహాక్షీ॥ 94

చం॥ మదనుని సైన్యముల్ మరియు మాధవుఁడుఁ జెలువారుచుండఁ బ
పదమున నెంటిగా దిరుగ వచ్చునటమ్మరొ కన్య; లొంటివై
పదమిడ వీవు నీదుముఖ పద్మము చెప్పక చెప్పుచున్నదో
మదవతి పల్లవాప్తి నను మానము వీడి వచింపు మంచనన్॥ 95

గీ॥ సిగ్గుచే దలవంచి నెచ్చెలినిఁ గాంచి
చాలుచాలింపుమీ యెగ తాళి నింక
ననుచు చెలితోడ గూడి య వ్వనినివీడి
జేరె నిలయము వ్యాకుల చిత్తయగుచు॥ 96

చం॥ పగలొనరించి పద్మినులఁ బట్టితి మేటివికాసమిచ్చి పై
నగ డొనరించితిన్ కువల యాళికి సత్కళమాపినాఁడ మి
త్రుగతిని నాదు గుట్టుచెడ రూఢిగ రాజరుఁదెంచనుండె నన్
దిగులున కన్నెరంగె నన నీరజమిత్రుఁడు గ్రుంకె నంబుధిన్॥ 97

చం॥ త్వరపడి కార్యముల్ సలిపి తత్సమయోచితమౌ నలంక్రియా
స్ఫురణ లొనర్చి త్రోవలను జూచుచు నాయకురాక గోరు పు
కరుహదళాయతాక్షులు ని గారపుఁ గోరిక నిల్లుఁజేరు ధీ
వరులును ముద్దుబిడ్డల య వారితమోదము లత్తరిన్ దగన్॥ 98

చం॥ కలువలరేఁడు వెన్నెలల గాయఁగ నేర్చిన మేటివాఁడు త
మ్ములకును సూడు చోరవిట పుంజపుఁ గోడు మెఱుంగుబోండ్లమో
ములకును నీడు జాబిలియ మూల్యపమోదితరంగజాలని
స్తులతరశుభ్రరోచులు గ [illegible] దిక్కునన్॥

సీ॥ దినమెల్ల గాఢని ద్రను వించునట్టి గ
ల్వలకు సౌంద్యంబెల్ల వాపెఁ గొన్ని
సంఫుల్లలీలభా స్వరగతి మించు త
మ్ములకాంతులెల్లను బొందెఁగొన్ని
మిన్కుమిన్కనుచును మెరయు జుక్కల యర
మాపు జాయల నెల్ల మాపెఁగొన్ని
జారచోరులకు ను త్సాహభంజకముగా
గడలేని కాంతిచే గ్రాలెఁ గొన్ని
ఘనజకోరంపు టి ల్లాంద్ర గారవమున
కేలికలై రుచి నెసఁగె గొన్ని
విన్ననెడి పీఠి తొగలరా విందు పాల
నంబుసలిపెడి తఁకిర ణముల రాణి॥ 100

చం॥ జలజఁపుటిండ్ల తుమ్మెదలు జాయలతో సుఖనిద్ర జెందఁ గ
ల్వలచెలికాఁడు సత్పథము బాలనఁ సల్పఁగ గద్దె నందది
క్కుల గల గండుచీకటులు గొంచెములేకయె నాశమొందవె
న్నెలపులుఁగుల్ యథేచ్ఛగ వ నిర్ జరియింపఁగ సాగెనత్తరిన్

చం॥ అలమిన బత్తితోడఁ బన లంతయు భూరుహకోటరంబులన్
నిలిచి తపంబుసల్పి హవ ణింపఁగ వేల్పులఁ బూజసల్పఁబూ
వులఁ గొనిరాఁగఁ బోఁదొడఁగు పోలికగుంపులుగూడి కౌశికా
వళి చరియింప సాగెనుజ వంబున నవ్వనరాజ మందునన్॥

గీ॥ పతివియోగంబు చేతను బడలునట్టి
చెలులకన్నుల గ్రమ్మిన శ్రములవితమున
చంద్రకిరణప్రసారంబు జరుగ నైంద
వాశ్మముల నీటి బిందువు లలముకొనియె॥

కం॥ తనయునిపరిపాలనకుఁ
మనమునసంతోషమంది మహనీయతరం
గవిచయహస్తయుగిఁ జా
చినగతి వారాశి యొప్పె శింజల్లీలఁ॥

ఉ॥ అంతట చంద్రహాసుఁడు ద్వి జామలసత్కరరాజితాప్తి న
త్యంత సుఖప్రసుప్తి విడి యల్లన వేదికడిగ్గునంతనే
చెంతలఁ బడ్డ జాబుఁగని చెచ్చెర చేకొని యుఁబ్రమాదమే
నెంత యజాగ్రతఁ నిదుర నియ్యెడఁ జెందితి నంచు నెంచుచుఁ

ఆశ్వాసాంతము

చం॥ సదమలమాదిరాజకుల సాగరచంద్ర! భవానినాధస
త్పదయుగలగ్నభావ! రస భావుకసత్కవితారహస్యసం
పదతులదత్తమానస! అ పారకృపారసభావనా సమా
స్పదకరణీయ! సూరిజన సంచితధర్మకళాధురంధరా!

భుజంగ ప్రయాతము

స్మరారాతి పాదాబ్జ సంలగ్న భావా
పరంధామ సేవాను భావస్వభావా
దురంతారి సంతాన దుర్వార లీలా
పరాస్త్రాఘ సంఘాత పర్యాప్తకాలా॥

ఇది శ్రీశేషాచలాధీశ చరణసేవాసమాసాదిత కవితా
విచిత్ర దూపాటి వంశపయఃపారావార సుధా
కర శేషాచార్యపౌత్ర వేంకటరంగాచార్య
పుత్ర శేషాచార్యకవి మిత్ర ప్రణీతం
బైన చంద్రహాస చరిత్రంబున
తృతీయాశ్వాసము సంపూర్ణము.





# చంద్రహాసచరిత్ర.

## చతుర్థాశ్వాసము.



శ్రీరామాసత్కరుణా
పారదృగంచలమరీచి సంజాతసుఖా
ధారవిభవాధిగతసం
సారా! రఘునాథరాయ సారాచారా॥

తే॥గీ॥ అవధరింపుము తద్వనా భ్యంతరంబు
విడచి కంఖాణమెక్కి గం భీరహృదయుఁ
డనఘుఁడగు చంద్రహాసుండు చనఁదొడంగె
శ్రీపురాభిముఖుండయి చిత్తమలర॥

ఉ॥ కనులకు ముందఱం గన్పడియెం గ్రమరసాలమనోజ్ఞవాటికా
జనితకిసాలభక్షణల సన్నవపంచమనాదగీతికా
జనితవనప్రియామృదువ చఃకలితంబగు కేళికావనం
బును పయిగాఁ నవచ్చె సుఖ భూనము శ్రీనగరీలలామముల్॥

ఉ॥ కనుగొని మంత్రిసత్తముఁడు కన్మని బంపిన దీపురంబుఁజే
ర్పనె గదయంచు మార్గపుభ రంబునుహర్మ్యవిలాసభావముల్
గనుచుఁ దొలంగఁ ద్రోయుచును గన్గొనె సౌధసుధాభిరామభా
జనజనపాలసేవ్యమయి జానగు మంత్రిగృహప్రదేశముల్॥

కం॥ అంతట గృహమునకుం జని
మంతిరి సుతుఁగాంచి యో కుమారక విభవా
క్రాంతుఁడగు నీమజనకుఁ డు
దంతము నాచేత బంపె నరయు మటంచున్॥

చం॥ అని తనకుప్పసంబునఁ గ లట్టి యొకానొక కమ్మఁదీసి యా
యనఘుని చేతికిచ్చి విన యంబు గ్రహింపుమ వేగనాజ్ఞనా
కొనరగఁ నిమ్మయంచు మృదు లోక్తులతో వచియించె మంత్రినం
దనుఁడుమనోంబుజాతమునఁ దాఁబ్రమదాతిశయంబుగాంచుచున్

ఉ॥ నవ్వుమొగంబుతోడ సుజ నస్తవనీయుని జంద్రహాసునిన్
బువ్వులబూజజేసి రస పుంజమృదూక్తుల నాదరించి నీ
వెవ్వరివాఁడవో యభిద యెయ్యదియో యని ప్రశ్నజేసి వా
క్రువ్వ ముదంబుఁ గాంచి తన కుంబిత వ్రాసిన లేఖగాంచుచున్॥

గీ॥ చంద్రహాసుని యానన ఽ చంద్రుఁగాంచి
యార్యమీరాక మాదుభా ఽ గ్యంపు ఫలము
ప్రాజ్ఞపాదరజం బది ఽ పడకయున్న
భవనమ్ము వనమ్ము కాదొకో ఽ భవ్యచరిత ॥

ఉ॥ ఆదరమొప్ప నివ్విధి ర ఽ సాకరవాక్కుల గారవించి యా
గాదిలి మంత్రినందనుఁడు ఽ గమ్మను పల్మరు చూచిచూచి స
మ్మోదముతోడ నాగతుని ఽ పూజ్యచరిత్రుని చంద్రహాసుఁబా
ద్యాదిక మిచ్చి ప్రేమఁజెలు ఽ వారఁగఁ జూచి వచించె నీవిధిన్॥

గీ॥ తావకాగమనంబు నా ఽ తల్లి చెంత
వినిచి యేతెంతు నీరాక ఽ విపులసౌఖ్య
భాగ్యభాజనమంచును ఽ బల్కి మంత్రి
తనయుఁ డంతటఁ దమితన ఽ జననిజేరె॥

కం॥ అమ్మా! జనకుఁడు లేఖను
సమ్మతితోఁ బంపె వినుము ఽ సంగతులను నే
మమ్మట మీకుశలాదులు
కమ్మను లిఖియింపుమనియెఁ ఽ గారుణ్యమునన్॥

చం॥ ఎలమిని జాబుఁదెచ్చిన య ఽ హీనుని గౌరవదృష్టిఁగాంచి నా
తలపుఁ బరిగ్రహించి గుణ ఽ ధామను మత్తనుజాతనిచ్చి కో
ర్కెలు దనివారఁ బెండ్లియొన ఽ రింపుఁడియాశుభవర్తమానముం
దెలుపుఁడు సంతసించెదను ఽ దీని నలంఘ్యముగాఁ దలంపుఁడీ॥

చం॥ అనివచియించి నీదుతన యామనిచ్చి వివాహమింక నా
ఘనునకు శీఘ్రమే జరుపఁ గా వలయున్ జనకాజ్ఞ మీఱఁగా
జనదన మాతయున్ మిగుల సమ్మదమంది యటుల్ బొనర్పమం
చును వచియించెఁ దత్తనయ చూపులఁ దాలిచె సిగ్గుమొల్కలన్॥

ఉ॥ అంతట మంత్రిపుత్రుఁడు గుణాకరుఁడా మదనుండు వేగఁగా
ర్తాంతికదిష్టమై తగు శుభావహలగ్నమునందు సోదరిన్
సంతతరూపవైభవల సత్తరరమ్యతరన్ కృశోదరిన్
కంతుని పూవుముల్కి యనఁగాఁ దగు నా విషయావధూమణిన్

కం॥ వివిధాలంకరణంబుల
మివులన్ భూషింప విషయ మించె మదను చేఁ
బువుముల్కి రీతి నచ్చెలి
నవలావణ్యంబు దనివె నయనయుగంబున్॥

గీ॥ చంద్రహాసుని చెంతకు సచివసుతుఁడు
సమ్మదంబున జేరి ప్రేమమ్ము నిగుడ
జనకునాన వచించి సాజన్యమెంచి
అనుగుఁ జెల్లెలిఁ బ్రేమ పెండ్లాడుమనియె॥

సీ॥ పురమెల్ల మివుల నచ్చెరువుగా నెంతో వి
లాసవంతముగా నలంకరించి
విషయను సౌభాగ్యవిభవాభిరామను
కళ్యాణవేదిపైఁ గ్రాలఁ జేసి

తూర్యనిస్వనముల ౼ స్తోకంబుగా మించఁ
బరిణయచిహ్నముల్ ౼ ప్రస్తరించి
చంద్రహాసుని రాజ ౼ చంద్రసంస్తవనీయు
గనకవస్త్రమ్ములఁ ౼ గట్టనిచ్చి

గీ॥ వివిధభూమీసురాశీఃప్ర ౼ విస్తరముగ
మంగళము రూపవంతమై ౼ మందిరమున
చెన్నుమీరంగ మదనుండు ౼ చేసె ననుజ
పాణిపీడన మహదుత్స ౼ వమ్ముఁ బేర్మి॥

కం॥ క్రమముగ వైవాహిక కా
ర్యములన్నియుఁ దీర్చి సుగుణ ౼ రాజితవిషయా
ప్రమదను స్యాలకుభూషా
రమణీయుల సల్పి సాను ౼ రాగముఁ జూపెన్॥

చం॥ అనుజను చంద్రహాసు ముద ౼ మారఁగ నామదనుండు వెంటఁదో
డ్కొని నృపహర్మ్యభాగమున ౼ కుర్జనియీతఁడ చెల్లికిన్ మగం
డని నచియింప నానృపతి ౼ యర్హుఁడు యోగ్యుఁడు నాకువంశమీ
తనివలనన్ ప్రశస్తకలి ౼ తంబుగ మించు నటంచుఁ బల్కుచున్॥

ఉ॥ కూరిమి చంద్రహాసుపయిఁ ౼ గూరిచి యాతని గౌరవించి స
త్కారమొనర్చి మానసగ ౼ తంబుగ నీతఁడు నాకునల్లుఁడై
మీరినచో మదన్వయస ౼ మిద్ధమహత్తరకీర్తివ్యాప్తమై
కేరడె చంద్ర[illegible] ౼ [illegible]డతఁ డనఁగ నొప్పెనే॥

కం॥ అని తలపోసియు విషయా
వనితామణి చంద్రహాసు వాల్లభ్యదయా
జనితాలోకనముల చే
దనియించెను హృదయమంత తాలిమిగదురన్ ॥

ఉ॥ పిమ్మట బెండ్లివార్త బృథివీసురుచే దనతండ్రి చేతనున్
సమ్మదమార బంప నల దుష్టసురమాళియు శోణపట్టణం
బిమ్మల జేరి దుష్టమతికీ కథనంతయు విన్నవింపగా
నుమ్మలికమ్ము నంది తనకున్నది బోయినటుల్ తలంకుచున్ ॥

ఉ॥ పుత్రుడు దుష్టచిత్తుడయి భూరిగుణాకర భాసమానయా
పుత్రిని చంద్రహాసునకు పూర్వము దంబున నిచ్చి స్వీయ చా
రిత్రము విల్లడించె నివరించను స్వీయదరాద్యమంబు నా
పత్రిక జూచి యిట్లు గలుగన్ దనకేమి ఘటిల్లెనో కదా ॥

చం॥ తనుమును వీనినంచును నిదోవిధి వ్రాయడిరస్కరించి తా
ననుజ నొసంగి పెండ్లితగు నా యొనరింపగ బుత్రకుండు నే
నొసరుచు కార్యమెల్ల నిటులూరక బోవుట చూడ జంద్రహా
సునకు జిరాయువుండెనను చున్ వరియించెడి దియే గదా ॥

ఉ॥ వ్రాసిన దొడ్డు నాతనయు వర్తనయొందగ దోచుచుండె నీ
దోసము చంద్రహాసునిదె ధూర్తు డతండిటు నేర్చి మార్చి యీ
వేసము వేసియుండనగు వీని యల్లుడటంచు నెంచి వి
శ్వాసము [illegible] వధ సల్పక మానగ రాదు నాకిటన్ ॥

సీ॥ తలను చెండుమటంచు ౯ తలవరులకొసంగ
పాపిచావక యెట్లొ ౯ బ్రదికినాఁడు
ఘోరకాననసీమ ౯ క్రూరమృగాళిచే
భక్షింపఁబడఁబోక ౯ బ్రతికినాఁడు
పృథులదుర్గమమైన ౯ శ్రీపురపథమున
మడిియక మృతికినూ ౯ ర్మసలినాఁడు
విషమునిమ్మనుచును ౯ విలిఖింప చావక
విషయను బెండ్లాడి ౯ వెలసినాఁడు
కటకటా! నాదుదుష్కృత్య ౯ కల్పనంబు
చంద్రహాసునిపట్ల సా ౯ జన్యకార
ణంబులుగ మించె నెట్లుచిం ౯ తామహాబ్ధి
నీదఁగలవాఁడ రిపువధి ౯ యించువాఁడ॥
గీ॥ అనుచు వ్యాకులవాతంబు ౯ లాశయమున
సారెసారెకు వీవగా ౯ సంచలించి
ఆత్మజుని దుండగమొ చంద్ర ౯ హాసు కృత్రి
మంబొ తెలియదుగాకని ౯ మదిఁదలంచి॥
ఉ॥ శోణపురంబు వీడి మది ౯ క్షోభవహింపఁగ దుష్టబుద్ధి పా
షాణశిలావిటంకవిల ౯ సత్పృథుకాననపంక్తిదాటి గీ
ర్వాణపురీవిలాసవిభ ౯ వంబులుగా దను శ్రీపురంబు నా
త్కోణగతార్తి పెచ్చరిలఁ ౯ గొండొక నాళ్ళకుఁ జేరియచ్చొటన్॥

కం॥ పరిణయచిహ్నకగనై
సిరిపొలఁతికి నాటపట్టు ౼ చెలువునఁ దగుమం
దిరమును దరియగఁ జని మది
దరికొను క్రోధానలంబు ౼ తాపంబీరన్ ॥

సీ॥ తనయునిఁ బిల్చి యిట్లు పరి ౼ తాపకరంబుగ సంచరించి నా
తనయను జాతిహీనునకు ౼ ధైర్యమెఱుఁగని వానికిచ్చి పెం
డ్లిని బొనరింప ధర్మమగు ౼ నేయను తండ్రికి మ్రొక్కి పుత్రుఁడి
ట్లని వచియించె నిర్మలయ ౼ థార్థవచోవిధి తాండవింపఁగన్ ॥

కం॥ మీయాజ్ఞను దీర్చితి నే
నీయెడస్వాతంత్ర్యబుద్ధి ౼ నెఱుఁగ ననుచుఁ గే
ల్దోయి ఘటియించి జనకుని
వ్రాయసముం జూపి యర్థ ౼ భంగినుడువఁగన్ ॥

సీ॥ అంతట దుష్టబుద్ధి హృద ౼ యంబు దపింపఁగ లేఖజూచి వృ
త్తాంతమెఱింగి యిందు విష ౼ యన్ లిఖియించితి మత్సుతుండు నా
స్వాంతమెఱుంగఁ డాయెనని ౼ సారెకు నైజదురుద్యమంబు చి
త్తాంతరమందె డాచి యతు ౼ లార్తిభరంబున నంతనొందుచున్ ॥

సీ॥ ఎవ్విధిఁ జంద్రహాసు వధి ౼ యించెద నెవ్విధిక్రోధమారు నా
నెవ్వగఁ బాయుటెట్టులని ౼ నెమ్మది వ్యాకులమందు నంత మేల్
జవ్వన మింపుగుల్క తను ౼ జాతయు నల్లుఁడు మ్రొక్కి రంత వా
క్రువ్వఁడు దీవనల్ తనదు ౼ క్రూరత చిత్తమునఁ దాచుచున్ ॥

గీ॥ సారెసారెకు నెమ్మది చంద్రహాసుఁ
జంపుయత్నంబులను జేయ సాగె నతఁడు
స్వాంతమున కొక్కయోజన సందడింప
నాత్మతాపంబు శమియించె నంచు నెంచి॥

ఉ॥ ప్రేమను చంద్రహాసు పిలిపించి మృదూక్తుల గారవించి మా
ధామము నీకతాన సురధామమె యయ్యె నటంచు మెచ్చి నీ
కామితసిద్ధి గల్గుటకుఁ గా గృహదేవతయైన కాళికిన్
శ్రీమహితానవద్యశశిశేఖరు నింతికి సేవచేయనౌ॥

కం॥ ఖండపరశుగేహినికిన్
బెండిలి కొమరుండు బలిని బెట్టుట మాకున్
గొండొక యాచారము చా
ముండయు నద్దానఁ దృప్తిఁ బొందును సుమ్మా॥

చం॥ ఇరులు దిగంతరాళముల నెల్లెడఁ గ్రమ్మెడివేళ మాంసమో
గిరము గ్రహించి కాళికిడి కేలుమొగిడ్చి వరంబులంద నొం
టరిగ గమించుచుండుటలు నాకులధర్మము గాన నేఁటి రా
తిరి పయనమ్ము గమ్ము సుకృతిప్రథ గాంచుము కొమ్ము సౌఖ్యమున్॥

కం॥ అనిపలికి చంద్రహాసుని
యనువుగ నందులకు బయనమగుమని సర్వం
బును సమకూరిచి యొంటిగ
జను తెఱగున్ దెలిపి యతని సద్మము జేర్చెన్॥

సీ॥ ఆనల దుష్టబుద్ధి హృదన ◊ యూవహాశోకభయాతిరేక దు
ర్భావము నైపలేక యతిపాపుల నల్వుర బిల్వబంచి సం
భావనఁ జేసి కాళిగుడి ◊ పజ్జకు వచ్చెడి వానితప్పకే
ప్రేవులు తీసివేగఁ బలి ◊ పెట్టుఁడు దేవికిఁ దెందుచిహ్నముల్॥
సీ॥ యుక్త మయుక్తమంచు మది ◊ నూహయొనర్పక యాతఁడెవ్వఁడీ
శక్తికి దాసుఁడంచు మది ◊ సంశయ మందక చెండి తద్గళ
ప్రక్తము భూతతృప్తికయి ◊ ధారుణిపైఁ బ్రసరింపఁజేసి నా
సూక్తిని నిర్వహింపుఁడుబ ◊ హూకృతులన్ బొనరింతు క్రమ్మఱన్
కం॥ అని రత్నభూషలును గాం
చన వస్తువులొసగి పంపఁ ◊ జని యవ్వారల్
సునిశితకరవాలములన్
గొని కాళిక యాలయమున ◊ గూఢతనుండన్
గీ॥ మాతులుని యాజ్ఞ నెరవేర్ప ◊ మానసమునఁ
దలఁచి యాచంద్రహాసుఁ డు ◊ దారమూర్తి
బలిపదార్థంబులను కేల ◊ బట్టి కాళి
కాలయముజేర జనసాగె ◊ నతులభక్తి॥
ఉ॥ ఆశల నంధకారరుచి ◊ యల్లుకొనంగఁ దొడంగ నొంటిగాఁ
బేశలగాత్రుఁడై తగు న ◊ భీరమనస్కుఁడు చంద్రహాసుఁడా
కాశదిశావకాశముల ◊ నారయుచున్ జనుచుండ మానస
క్లేశముగల్గె భావముచ ◊ లింపఁగ సాగెను బెన్కురీతులన్॥

చం॥ ఇదియిట్టులుండఁగ శ్రీపురమ ౯ హీంపతియక్షా విజయుండు దీర్ఘమా
గదము వ్యధావికారములు ౯ కల్గఁగ జేయఁగనొచ్చితత్ శ్రమా
స్పదుఁడయు బాధనొందుచును ౯ బంచతగాంచఁగ నుండి యంతలో
మదనుని గాంచి ప్రేమము స ౯ మంజసలీలఁ జెలంగ నిట్లనెన్॥

కం॥ మంత్రియయి నీజనకుఁడు స్వ
తంత్రమ్ముగ రాజ్యభార ౯ తత్పరుఁడై తా
తంత్రజ్ఞానవిదగ్ధా
మంత్రణమున మమ్ముఁ ధనిపె ౯ మానస మలరన్॥

గీ॥ మొదటనుండి మంత్రి ౯ పదవి మీరుండుటఁ
బాలనంబు మాధు ౯ పజ్ఞనుంట
నాదినుండివచ్చు ౯ ననుచారమయ్యె మీ
సమ మనీష కెన్నొ ౯ స్వాగతములు॥

ఉ॥ ప్రాజ్యరమాభిరామమయి ౯ భాసిలుచుండిన్న మామకీనవక్షా
రాజ్యము నింక మీదఁ బర ౯ రాజులదుర్వశమౌనొ యేమొనా
స్రామాజ్యము పుత్రశూన్యమగు ౯ మాకులమెట్లు భరించునింక స
త్పూజ్యన కీధరాభరమ్ము ౯ పూజ యొనర్చిమొసంగఁ గాదగున్॥

చం॥ కలదొక పుత్రినాకు కవి ౯ గౌరవనీయనయోవిలాసని
ర్మలతరరూపవైభవవి ౯ రాజితగాత్రి తదంగనాసము
జ్జ్వలతరసుందరంబునకు ౯ సాటికి వచ్చెడి రాజపుత్రునిన్
నిలిపెద రాజ్యమందు బను ౯ సీ దగనల్లునిగా నొసర్చెదన్॥

కం॥ సర్వవిధంబుల లక్ష్మీ
ధూర్వహుఁడగు వాఁడు లేఁడు ౪ దుస్తరమిది, నే
సర్వత్రఁగాంచితిని యొక
సర్వజ్ఞుఁడు కలఁడతండు ౪ సంభవమగునే॥

కం॥ అని సంశయించు నాభూ
పుని మొగమునుజూచి మంత్రి ౪ పుత్త్రుఁడు మదిలోఁ
గొనలెత్తు మోదమున నా
తనిపేరుం దెలుపుమని యు ౪ దారతఁ బలికెన్॥

చం॥ అనవుడు రేఁడునెమ్మనము ౪ నందునమోదము తాండవింపఁగా
గనులు వికాసభావమునఁ ౪ గ్రాలఁగ నిట్లువచించెఁ జంద్రహా
సునకు మదీయపుత్త్రికను ౪ క్షోణిభరంబును నర్పితంబుగాఁ
బొనరుప నెంచినాఁడ హిత ౪ ముగ్ గలదేనియుఁదెల్పఁగాఁదగున్

సీ॥ ఎలప్రాయమున యందు ౪ నెల్లవిద్యలనేర్చి
కమనీయతరకీర్తి ౪ గాంచినాఁడు
సద్గుణంబులయందు ౪ సౌజన్యములలోనఁ
బురుడు చూపఁగరాని ౪ పుణ్యమూర్తి
సామ్రాజ్యపాలనా ౪ చాకచక్యములఁగా
ణాచియనందగు ౪ రాచబిడ్డ
శరకళాకౌశలి ౪ సాహిత్యగరిమంబు
మనుష్యోత్తగవొప్పు ౪ నురుయశుండు

గీ॥ శోణకటకరమాభార  శోభితుండు
చంద్రహాసుండు కరగత  చంద్రహాసుఁ
డాత్మజాతను బేర్మి పెం  డ్లాడ రాజ్య
రమనుగేల్పట్టి నాకు యు  క్తమని తోఁచె॥

చం॥ అనిశము నాదురాజ్యమునె  యాశ్రయమున్ బొనరించియున్ననీ
జనకుఁడు దీనివిన్న మది  సంతస మందియు తీఱుఁ బుత్రుఁడ
న్నను మఱియల్లుఁడన్నను జ  నంబులు వేఱుగ నెంచఁబోరు నా
తనయను నీదుసోదరిగఁ  దత్పరతన్ దలపోయఁగాఁదగున్॥

కం॥ ధరణీశుఁడివ్విధమ్మున
సరసోక్తి నిధానమగు ప్ర  సంగాంతమునన్
ద్వరితగతిఁ జంద్రహాసుని
యరువేరఁగఁ జేయుమంచు  నాజ్ఞయొసంగెన్॥

చం॥ మదనుఁడు సత్వరంబుగను  మందిరమున్ దరియంగనేగి ధీ
సదనుని చంద్రహాసు గన  జాలక యచ్చటి వారిచేత న
క్కొదువ కథావిశేషమును  గూఢ శ్రుతిస్థలిఁ జేర్చి కాళికా
సదనము జేరు నమ్మహిఁది  సన్నిధికై పయనంబుఁ జేయుచున్॥

కం॥ విధ్వస్తదైత్యుఁడై గా
ఢధ్వాంతమునందుఁ జని త  టాలున నమ్మ
ధ్యాధ్వమునఁ జంద్రహాసుని

సాధ్వర్చితుగాంచి మృదువ  చఃకశితి నన్నున్॥

గీ॥ మఱంది ! నిన్ను రాజు • మాటాడిపొమ్మనె
తడవుచేయ కింక • తరలుమయ్య
రాజునాన దాట • రాదు రాష్ట్రీయులు
ప్రాణమేగుచున్న • పట్లనేని॥

కం॥ ఈలోన నేను కాళికి
వైళమపూజావిధుల్ స • పర్యసలిపి రా
జాలయమున కేతెంచెద
నాలస్యముచేయకీవు • నరుగంగ దగున్ ॥

చం॥ అని మరదిన్ ధరావిభుని • యంగణముల్ దరియంగ బంచి తా
గొనకొని కాళిపూజలకు • గూడిన యర్హసువస్తుసంతతిన్
గొని హృదయంబు భక్తి రస • గుంఫితమై తనదార ముందు వె
న్కను గన మాని సత్వరము • కాళికగేహముఁ జేరె నత్తరిన్ ॥

ఉ॥ ఆలయసీమ జేరు సచి • వాత్మజుపై బడి తండ్రిపంపుచేఁ
గాలము వేచియున్న బయ • కారులు కత్తులడాలు మించఁగాఁ
గాలుభటప్రతానముల • కైవడిఁ బైబడి ఖండఖండముల్
జీలిచి మేను సర్వమును • జెండిగ్రహించిరి స్కంధభాగముల్ ॥

కం॥ ప్రెగ్గడ బిడ్డతలంగొని
దిగ్గనప్రభుకార్యభరము • దీర్చితిమని లో
మొగ్గుగ మోదము నందుచు
కిగ్గాడి దురాత్ములు పురి • కేగి జనిరంతన్ ॥

గీ॥ చంద్రహాసుండు కాళికా సద్మమునకు
మదను బంపించి భూవిభు సదనమునకు
గటికిచీకటిలోన నా క్కరుఁడు వచ్చు
చుండె శుభసూచకములకు నుత్సహించి॥

ఉ॥ వచ్చిన చంద్రహాసుని నృ పాలుఁడు గౌరవలీలఁగాంచిపైఁ
జెచ్చెర జేరఁజీరి తన చేత రహించెడి ముద్దుటుంగరం
బిచ్చి కవుంగలించి కొని యీతటినుండి మదీయరాజ్యసం
పచ్చతురుండవై చిరశు భంబులఁ గాంచుమటంచు నిట్లనున్॥

కం॥ చంపకమాల యనం ధీ
సంపన్నిరవద్య యాత్మ జాతకలదు నీ
వింపుగ నాయమనుం బ్రే
మింపుచుఁ బరిణయముగనుమి మెచ్చ జనంబుల్॥

చం॥ ఇటుల వచించి రేఁడు కృత కృత్యుఁడనైతిని నాదు జన్మమిం
తట నె కృతార్థభావమును దాలిచె నాత్మజకర్హుఁడైన యు
త్కటగుణభాసురాత్మకుఁడు ధన్యుఁడు భర్తలభించె రాజ్యమ
న్నిటను సమర్థుఁడైన నృపు నిన్ బతిఁగాఁగాన సంతసించితిన్॥

కం॥ అని వచియింపఁగ వేల్పులు
ఘనతరసమ్మోదభావ కల్పన మెదలో
గొనలెత్త పుష్పవర్షం
బునుగురిసిరి [illegible] వులు నీచె నిలన్॥

వ॥ అంత సిద్ధాంతిముఖ్యనిర్దిష్టంబగు నాశుభముహూర్తముననే విజయభూమీశ్వరుండు నిజబంధుహితామాత్య సామంతపరిజనంబులకు నేటిరాత్రికి నాత్మసామ్రాజ్యంబు చంద్రహాసునకుఁ బట్టంబు గట్టెదమనియు నెల్లిచంపకమాలి నొసంగి శుభవివాహంబు గావింతుమనియు శుభపత్రికల వ్రాయించి సర్వస్థలంబులకుఁ బంపిన

కం॥ మంగళనాదమ్ములు దిశ
లంగూలంకషముగాఁ జె । లంగఁగ ధాత్రీ
శాంగణము సర్వవిధముల
మంగళనిలయమ్ముగా స । మంజసమయ్యెన్॥

సీ॥ భూమీతలనాయక । సద్మంబునందున
మంగళరావముల్ । మారుమ్రోయ
నాలించి హేతువె । య్యది యంచు తాదుష్ట
బుద్ధియొంచెడి వేళ । భూమిసురుఁడు
మంగళపత్రిక । మంత్రికి నొసఁగ నా
తండద్దిచూచి ఖే । దంబువిస్మ
యంబును జెంది యె । ట్లవనీశ్వరుండు ప
ట్టాభిషేకము చంద్ర । హాసునకును

తే॥ సల్పు నాతండు కాళికా । సద్మమందు
నాదుకృత్రిమమునఁజచ్చి । నాఁడు కాదె
యనుచు యోజించు వేళ కే । హాంతకులును
మదను శిరమును దెచ్చిరో । మంత్రికడకు॥

ఉ॥ అంతటదుష్టబుద్ధి హృదయంబున సంశయ ముల్లసిల్లఁగా
వింతదనమ్ముఁగాంచి కడు వేమరుదాల్చిన పోల్కినుండి దృ
ష్టాంతముఁ బోల్పఁజాలక నిరంతర దుర్భ్రమ నంది చంద్రహా
సాంతము హంతకుల్ సలిపి ఘాతని కెట్టుల రాజ్యమిచ్చుటల్॥

కం॥ కడతేరె చంద్రహాసుం
డడఁగె మదీయాగ్రహప్రయత్నమ్మని ముం
దడుగిడి ఖండితశిరమున్
బొడఁగని దీపముల చెంతఁ బోల్చిపొగలుచున్॥

ఉ॥ ఖండితశీర్షభాగము జగన్నుతనిర్మలఛవి శేషస
న్మండితమూర్తియౌ మదనుమస్తకమంచును నిశ్చ[illegible] తా
గుండియ బాదుకొంచునను గుం గొడుకా కొడుకా యటంచునో
రెండఁ బ్రపంచమున్ మఱచి యేడువసాగె ననేకరీతులన్॥

మ॥ తనయా! నిన్ను స్వతంత్రపాలకునిగాఁ దాత్పర్యమొప్పాఱ సే
ననయంబున్ బొనరించుయత్నములు వ్యర్థాకారమున్ దాల్చెనీ
తనుభాగంబును గాంచి యెవ్విధమునన్ దాపంబు సైరింతు ని
న్ననకే నెట్టుల జీవితావధిని నెగ్గన్ సేతురా పుత్రకా॥

చం॥ తల ధరపైని మోదుకొని తాపమునొందుచు నేడ్చుచున్ సుతున్
దలఁచుచు దుష్టబుద్ధి పరితాపమునొందెడి రీతిగాంచి హృ
ద్విలసితశోకభారమున విశ్వము విస్మృతినొంది వాని భా
ర్య లలిత [illegible] దాల్చె విచారభావమున్॥

చ॥ తనయుని జంపికొంటి పరి కె తాపకరంబగు నాదుజన్మమే
లని యలదుష్టబుద్ధి తన కె యంగనతోఁ జితిచొచ్చ నెంచగాఁ
దనయయు భ్రాతృశోకమున కె ధైర్యముమాని శరీరమగ్నిలో
నని నిడనెంచె శోకరస కె నాటకమాడిరి వారలెల్లరున్

చ॥ అదివిని చంద్రహాసుఁడభ కె యం బభయంబని పల్కికొంచునే
మొదవె? వచింపుఁడంచుఁ దన కె యోలగమున్ విడియేగుదెంచియు
న్మదనుని రక్తలిప్తమగు కె మస్తకభాగము చూచి కన్నులన్
బ్రిదిలి విచారలీనముగ కె వేఁడిజలంబు జనింప నేడ్చుచున్॥

సీ॥ విషయను నాకిచ్చి కె పెండ్లిగావించిన
యానాఁటి నీసుద కె యారసంబు
అన్యుఁడటంచు న కె న్నరయక కడుగౌర
వించుచు నుండు నీ కె ప్రేమభరము
సామ్రాజ్యమేలెడి కె సౌభాగ్యమొనగూర్చి
కనికరించిన నీదు కె వినయగరిమ
అనుజని కంటెన కె న్ననురాగమునజూచి
వర్ధమానునిజేయు కె వత్సలతయు

తే.గీ॥ భావమున సుస్వరూపసం కె పదలఁదాల్చి
మర్మములఁ జెందుచుంటి నో కె మదన నిన్ను
విడచి నేనెట్లుబ్రతుకుదీ కె పృథ్వీభరము
నీవు లేకున్న [illegible]

చం॥ అనుచును జంద్రహాసుఁడు క రాసిని కంఠముపైని జేర్చినా
యనుగు గతింప నే బ్రతికి యాపయి గాంచెడి సౌఖ్యమెద్ది యం
చును తలద్రెంచికోఁ దలచు చుఁ గనుదోయి నిమూయునంతఁదో
నన సురలెల్ల పూజడి నా నచ్చిరి దిక్కులు పిక్కటిల్లఁగన్॥

సీ॥ రౌద్రరసంబును రాగరసంబును
ముఖసరోజమ్మున మొలకలెత్త
కరఖడ్గకాంతులు కాంచనభూషలు
వింతవన్నెలతోడ వియ్యమంద
సంభ్రమవేగంబు శాంతస్వభావమ్ము
పాలునీర్వలె నైక్య భావమొంద
కడకంటిచూపులు కారుణికత్వంబు
సుస్వరూపంబున శోభిలంగ

గీ॥ అడకువయు నెయ్యమును మది సంకురింప
భువనమోహనరూప నై భవముగదురఁ
గాళికాదేవి గళగత ఖడ్గమూని
యప్డు ప్రత్యక్షమై చంద్ర హాసుఁ దనిపె॥

ఉ॥ మెచ్చితి నీదుభక్తి నెద మెచ్చితి నీబుజవర్తనావళిన్
మెచ్చితి మిత్రభావమును మేదిని నీసుయశఃపతాకముల్
నిచ్చలు తాండవింప ధర ణీ భరమున్ వహియించు మయ్య నీ
కిచ్చెద నద్దియో వరము లీప్సితముల్ ఘటియింతు నంచనన్॥

॥ చంద్రహాసుండు మోదంబు ʃ సందడింప
కలవు భోగమ్ములెన్నియో ʃ ఘనచరిత్ర
నాత్మమిత్రుని దయచేయు ʃ మంతెచాలు
స్వర్గపరిపాలనంబునో ʃ సంగినట్లు॥

మ॥ అని ప్రార్థించిన కాళియయ్యకొని చి ʃ త్తాంకూరితానందభా
జనమై యవ్విధిసల్పఁగా మదనుఁడా ʃ శాపాశనిర్విణ్ణునిన్
జనకున్ గూర్చి నమస్కరించి జననిన్ ʃ సౌజన్యతన్ జూచి మి
త్రుని యాలింగనమున్ బొనర్చియనుజన్ ʃ దోడ్తోడవీక్షింపుచున్॥

చ॥ కనులనుమోడ్చునంత నల ʃ కాళియుదృష్టిపథంబుదాటె నె
మ్మనమున దుష్టబుద్ధియు బ్ర ʃ మాదము నందితినంచు మంత్రిసం
దను ననురాగభావకల ʃ న్ కవుగింట ధరించి దోషినై
తిని ననుసైపుమంచును ను ʃ తించెను దత్సతి మోడ్చి కేల్గవన్॥

తే॥గీ॥ అవలచంపకమాలిని ʃ హస్తమంది
యాత్మసామ్రాజ్యమును విభ ʃ వాకరముగ
నరసి పాలించుచును చంద్ర ʃ హాసవిభుఁడు
మదనునకు చెంగట నమాత్య ʃ పదవి నొసఁగె॥

చ॥ ధరణి సమస్తసస్యకలి ʃ తంబుగ బంటలతోఁ దనర్చె, ధీ
వరులు నృపాలపాలన సు ʃ భాగ్యముగాంచి రహించె ధారుణీ
భరము తొలంగె నాకనుచు ʃ భావనజేసె మహీవిభుండు ధ
ర్మరుచిరసంవృత్తంబుగ ర ʃ మాపతి వరనసల్పె నెయ్యెడన్॥

కం॥ ఈకథ వ్రాసిన జదివిన
ప్రాకట భోగాలవాల బహుళ భాగ్యంబుల్
శ్రీకాంతుఁడు కృపఁజేసి శు
భాకాంక్షుల నొసఁగి మెప్పు డలరుచుగాత౯॥

—◆ ఆశ్వాసాంతము. ◆—

చం॥ అతులిత షట్సహస్రమహి తాన్వయవార్ధిశశాంక శాంకరీ
పతిచరణాంబుజద్వితయ బద్ధమనోబ్జ సదాన్నదానస
ద్వ్రతనియతాభిరామ గుణ వన్మణిమంజులభాసమాన పం
డితజనకీర్తనీయ సుగు ణీస్మరణీయ దయారసోదయా॥

స్రగ్విణి.

నీరజాతాన్వయా నిత్యసత్యోదయా
ధీరచేతఃప్రియా దీనమోదోదయా
సూరిగేయవ్రతా స్తుత్యకీర్తిస్థితా
ధారణాసంగతా ధైర్యసుశ్రీయుతా॥

గద్య.

ఇది శ్రీశేషాచలాధీశ చరణసేవాసమాసాదిత కవితా
విచిత్ర భూపాటివంశపారావారరాకాసుధాకర
శేషాచార్యపౌత్ర వేంకటరంగాచార్య
పుత్ర శేషాచార్యకవిమిత్ర ప్రణీత
చంద్రహాస చరిత్రమ్మునందు
చతుర్థాశ్వాసము సంపూర్ణము.

# తప్పొప్పుల పట్టిక.

---

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 10 | 10 | భాసుకారా | భాసురాకారా |
| 15 | 2 | ప్రథమాశాశ్వము | ప్రథమాశ్వాసము |
| 33 | 12 | రామనిఁ | రామునిఁ |
| 34 | 2 | స్తుత | స్తుత్య |
| 45 | 18 | ప్రస | ప్రసక్తి |
| 59 | 9 | చుంగులు | చెంగులు |
| 70 | 6 | నియ్యంబు | వియ్యంబు |
| 71 | 6 | వననట్లాకె | విననట్లాకె |
| 72 | | చంచ్రహాస | చంద్రహాస |
| 75 | 16 | ద్యుంతు | ద్రుంతు |
| 76 | 6 | నాద్భాదనంబు | నాచ్ఛాదనంబు |
| 77 | 12 | బోఘ | బోయ |
| ,, | ,, | సాహసులు | సాహసుల |
| 79 | 6 | గాక | గాగ |
| 82 | 18 | పుజంపు | పుంజపు |

---

